1.3.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:09 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18


# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి




## తెలుగుదేశం మూడు ముక్కలు కానున్నదా?

# హరికృష్ణ, దగ్గుపాటిలతో బాలకృష్ణ కొత్త కుంపటి?

తెలుగుదేశం మరొక సారి చీలనున్నదా? మూడవ కుంపటి వెలగనున్నదా? రాజధానిలో గత రెండు రోజులుగా ముమ్మరంగా జరుగనున్న రాజకీయ చర్చలు, సంచలనాలను పరిశీలించి చూస్తే ఈ మార్పు సంభవమో వచ్చేట్లుంది.

ఇప్పుడున్న బాబు తెలుగు దేశం, పార్వతి తెలుగు దేశంలు రెండూ సంక్షుభితంగా వున్నాయి. అవసరానికి మించిన శాసన సభ్యుల మద్దతు కలిగిన చంద్రబాబు కూడా తన పదవి సురక్షితమన్న నిలకడంతో మనలేక పోతున్నారు. ఏదో తెలియని అభద్రతా భావం ఆయన్ను బాధిస్తున్నది. అందువల్లే రోజు రోజుకి చాలా అసహనంగా తయారౌతున్నారు. ఆయనకు నిద్రలోను, మెలకువలోను హరికృష్ణ రూపం భయంకరంగా కన్పించి భయపెడుతూంది. ఇద్దరి మధ్య ఎన్‌టిఆర్ పై తిరుగుబాటు నాటి సయోధ్య అంతరించి పోయింది. తను ఉప ఎన్నికలో గెల్చి మంత్రి పదవిలో కొనసాగేందుకు అనువుగా ఏర్పాట్లు చేయడంలో చంద్రబాబు కావాలనే జాప్యం చేశారని; తనను తప్పించ డానికి కుట్ర పన్నారని హరికృష్ణ అనుమానం. ఆ అనుమానం పెను భూతమై బావ, బావ మరదుల మధ్య ఎడబాటు పెరిగి పోతూ వస్తున్నది. మంత్రి పదవి పూర్తి తర్వాత కాని దాని విలువ హరికృష్ణకు అర్థం కాలేదు. ఒక్కసారి మంత్రి పదవిలో వున్న వారు, అది లేకుండా బ్రతకాలంటే వూపిరాగి పోయినట్లు విలవిల లాడి పోతారు. హరికృష్ణ పరిస్థితి ప్రస్తుతం అదే. ఆ చికాకుతో, ఆ కోపంతో హరికృష్ణకు మనసు ఒక చోట నిలవడం లేదు. ఆ అక్కసు నంతటినీ చంద్రబాబు పై ప్రదర్శిస్తున్నారు. బావ మరిది అలక

> చంద్రబాబు,
> లక్ష్మిపార్వతిల పై
> అసంతృప్తితో
> తిరుగుబాటుకు
> రంగం సిద్ధం!

తీర్చడంలోనే ఈ బావ గారి నైపుణ్యమంతా ఖర్చయి పోతున్నది. ఈయన భయపడే కొద్దీ, ఆయన బ్లాక్ మెయిల్ పెరిగి పోతున్నది. అసంతృప్తి ఎమ్మెల్యేలంతా ఒకరొకరుగా హరికృష్ణ ప్రక్క చేరి ఆ నిప్పును మరింత రాజేస్తున్నారు.

అక్కడ లక్ష్మిపార్వతి శిబిరంలోనూ పరిస్థితి డిటో! ఇక్కడి హరికృష్ణ పాత్రను అక్కడ దగ్గుపాటి వెంకటేశ్వర రావు మహా నేర్పరి తనంతో పోషిస్తున్నారు. అత్త, అల్లుళ్లకు క్షణం పడడం లేదు. చీటికి మాటికి అలిగి, అటకెక్కి కూర్చుంటున్న అల్లుడ్ని బ్రతిమలాడి, బామాలి దారికి తెచ్చుకోవడంలో పాపం అత్తగారు చిక్కి శల్యమై పోతున్నారు.

రెండు శిబిరాలూ ఎన్‌టిఆర్‌ను మర్చి పోయాయి. ఆ పేరు, ఆ వూసు కూడా విన్పడడం లేదు. ఎవరి యావలో వారు పడిపోయారు బ్రతికి నంత కాలం భారతంలో రారాజు వలె దర్పంగా, దర్జాగా అందర్నీ హెచ్చరిస్తూ బ్రతికిన ఆయన గప్పుడు తన సొంత మనుషులనుకున్న వారి స్మృతి పథం నుంచే మాసి పోవడం చాలా విచిత్రమైన విషయం. ఈ పరిస్థితి వస్తుందని ఎన్‌టిఆర్ బ్రతికి వున్నప్పుడు కల కూడా కని వుండడు. తన వారే తననింత హీనంగా చూస్తారని తెలిసి వుంటే ఆయన వట్టి కాషాయం కట్టడం కాదు - నిజంగానే సన్యసించి ఏ హిమాలయాల లోనో వాన ప్రస్థాశ్రమం స్వీకరించి వుండేవారు.

అసంతృప్తితో, ఆగ్రహంతో, అలుకతో, అక్కసుతో ఆక్రోశిస్తున్న హరికృష్ణ, దగ్గుపాటిలను కలిపి - బాలకృష్ణను ముగ్గులోకి దింపి ఈ ముగ్గురితో ముచ్చటగా మూడవ తెలుగు దేశం పార్టీ ప్రారంభించాలన్న ప్రతిపాదన ఇప్పుడు రెండు శిబిరాలలోనూ చురుకుగా పరిశీలనలోకి వచ్చింది. మొన్ననే రాజ్యసభకు ఎన్నికైన హరికృష్ణ అంతే వాసి యార్లగడ్డ లక్ష్మిప్రసాద్ ఈ కొత్త ప్రతిపాదనను చర్చకు పెట్టారు. ఏ సుముహూర్తంలో ఆ ఆలోచన కల్గిందో కాని, ఉభయ శిబిరాల నుంచీ దానికి మంచి ప్రతిస్పందన లభిస్తున్నది. ఎన్‌టిఆర్ వారసులుగా ఆయన మరణప్ప సానుభూతిని ఓట్లుగా మల్చుకొని లోక్‌సభ ఎన్నికల్లో పార్టీని గట్టెక్కించే సమర్థత ఇటు చంద్రబాబుకు, అటు లక్ష్మి పార్వతికి లేదని అర్థమై పోయిందని; ఈ ఇద్దరికీ జనంలో అణు మాత్రం గౌరవం, గుర్తింపు లేవని; ఈ దశలో వీరిని నమ్ముకొని రాజకీయం చేస్తే తమ రాజకీయ భవితవ్యాలు శాశ్వతంగా చీకటి మయమౌతాయని తెలుగు ఎమ్మెల్యేలు భావిస్తున్నారు. సింహగర్జన విజయ వంతమైనా ఆ తర్వాత లక్ష్మిపార్వతి వేసిన తప్పటడుగులు, మ్యూజియం వ్యవహారంలో ఆమె అసభ్య ప్రవర్తనను ప్రజలు ఈసడించు కొంటున్నారని ఎమ్మెల్యేల భావన. ఒకవేళ జనం ఆమెను ఎన్‌టిఆర్ వారసురాలిగా గుర్తించి, సానుభూతి పవనం ఆమె దిశగా పయనించినా - దాన్ని ఓట్లుగా మల్చుకొనే యంత్రాంగం, సమర్థత ఆమెకు లేవని వీరు అభిప్రాయ పడుతున్నారు. చంద్రబాబు ఓట్ల విషయంలో వట్టి డమ్మీ అని అంద రెరిగిన సంగతే.

ఈ స్థితిలో హరికృష్ణ, బాలకృష్ణ, దగ్గుపాటిలు ఏకమైతే తెలుగు ప్రజానీకం వారిలో కొత్త నాయకత్వాన్ని వీక్షించి, ఎన్‌టిఆర్‌కు అసలైన వారసులుగా ఆదరిస్తారని; లోక్‌సభ ఎన్నికల్లో ఈ త్రిమూర్తుల బ్యానర్ పైన రాజకీయ ప్రచార చిత్రం విడుదల చేస్తే బ్యాలెట్ పెట్టెల హిట్ అవుతుందని ఆశ పడుతున్నారు.

ఇటువంటి ఏర్పాటుకు హరికృష్ణ, దగ్గుపాటి మహా దానందంగా సిద్ధమౌతారనేది వాస్తవం. అంతకు మించి వారికి వేరే గత్యంతరం కూడా లేదు. విధి లేక, ఎటు పోవడానికి దారిలేక ఇరువురూ తమ తమ శిబిరాలలో తల దాచుకొని వున్నారు తప్ప, ఎక్కడైనా చెట్టు నీడ దొరుకుతుందున్న ఆశ కల్గినా గుడిశె మీద చెల్చుకొట్టి లేచి పోవడానికి వారివురూ సిద్ధమే. కాని బాలకృష్ణ ఈ ప్రతిపాదనను ఎంత వరకు ఆమోదిస్తా డన్నది ప్రశ్న. ఇప్పటి వరకు బాలకృష్ణకు ప్రత్యక్ష రాజకీయ సంబంధాలు లేవు; అట్లని ఆయన వాటికి దూరంగానూ లేడు. ఎన్‌టిఆర్ పై చంద్రబాబాదుల తిరుగుబాటు సమయంలో బాలకృష్ణ బావగారి పక్షాన నిల్చారు; ఆ వెంటనే ఆయన తండ్రిని కలిసి బావను దూరంగా పెట్టారు; తిరిగి తండ్రి మరణం తర్వాత బావకు చేరువైనారు. ఈ దాగుడు మూతలు కుటుంబ పరంగా జరిగాయి తప్ప, రాజకీయ ప్రయోజనా లాశించి చేసినవి కావు. ఈ పరిస్థితిలో ఆయన ప్రత్యక్ష రాజకీయం ప్రవేశం చేస్తారా?

బాలకృష్ణ అందుకు సమ్మతిస్తే మాత్రం తెలుగు దేశంలో మూడవ కుంపటి వెలిగించడం మాత్రం దాదాపు ఖాయమైనట్లే! తరువాత కథ వెండి తెర పై తిలకించి ఆనందించడం తెలుగు ప్రజల వంతు.

# హత్యలో రాజకీయాల పై సిబిఐ మౌనం!

ఒంగోలు పార్లమెంటు సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారి హత్య కేంద్ర నేర పరిశోధక సంస్థ సిబిఐ ఒంగోలు సెషన్స్ కోర్టులో ఛార్జిషీటు దాఖలు చేసింది. క్రిమినల్ చట్టం క్రింద కేసుకు సంబంధించి నిందితుడు దొరికిన 90 రోజుల లోపల కోర్టులో ఛార్జిషీటు దాఖలు చేయాలన్న నియమం వుందట. దాన్ని పాటించ డానికి కోర్టుకు వెళ్లవలసి వచ్చిందే తప్ప ఈ కేసులో దర్యాప్తు జరప వలసిన విషయాలు ఇంకా వున్నాయని సిబిఐ అధికారులు చెప్తున్నారు.

ఛార్జిషీటులో తొమ్మిది మంది నిందితులను పేర్కొన్నారు. వారందరూ పీపుల్స్ వార్‌కు సంబంధించిన నక్సలైట్లని స్పష్టం చేశారు. వారు మినహా మరెవ్వరికీ ఈ కేసుతో సంబంధం వున్నట్లు కాని, తమకు మరెవ్వరి పైనైనా అనుమానం వున్నట్లు కాని సిబిఐ అధికారులు అందులో వ్యక్తం చేయలేదు. ఛార్జిషీటు వివరాలు స్థూలంగా పరిశీలిస్తే - ఈ కేసు దర్యాప్తులో వీరు వెలికి తీసిన కొత్త సంగతులేవీ లేవని; అంతకు క్రితం సిబిసిఐడి పోలీసులు సేకరించి పెట్టిన సమాచారం ఆధారంగానే వారు ఛార్జిషీటు దాఖలు చేశారని భావించ వలసి వస్తున్నది. సిబిసిఐడి కంటె

> మాగుంట కేసులో
> ఛార్జిషీటు దాఖలు

అదనంగా తెలుసుకో దగిన విషయాలేవీ లేనందువల్ల సిబిఐ ఈ ఛార్జిషీటు తయారు చేసిందా? లేక వారి దర్యాప్తు ఇంకా ఒక కొలిక్కి రానందు వల్ల తాత్కాలికంగా పాత ఫైలును తిరగ వ్రాశారా అన్న విషయం మనకు తెలియదు.

సుబ్బరామ రెడ్డి గారి హత్యలో రాజకీయ ప్రమేయం వున్నదన్న అనుమానం సర్వత్రా వ్యాప్తిలోకి వచ్చిన నేపథ్యంలో సిబిఐ ఛార్జిషీటు ఆ ప్రస్తావన చేయక పోవడం విచిత్రం. హంతకు లందరూ నక్సలైట్లని, హత్యకు జరిగిన కుట్ర పీపుల్స్ వార్ నేతృత్వంలో జరిగిందని పేర్కొనడం ద్వారా ఈ హత్యలో రాజకీయం ప్రమేయం లేదని సిబిఐ పరోక్షంగా నిర్ధారించి నట్లయింది. అయితే దర్యాప్తు ఇంకా పూర్తి కాలేదని పేర్కొనడం ద్వారా ఆ అనుమానాలను మాత్రం ఇంకా సజీవంగా వుంచారు సిబిఐ అధికారులు.

ఈ కేసును - రాజీవ్ గాంధీ హత్య పై విచారణ జరిపిన ప్రతిభావంతుడైన అధికారి శ్రీ కార్తికేయన్ పర్యవేక్షిస్తున్నారు. ఎంతో సంక్లిష్టమైన కేసులను నిర్వహించిన అనుభవ పరుడు

కొరప 7 పేజీలో

## పెండ్లిండ్లు

వరగలి సామ్రాజ్యంలో విప్లవ శంఖం పూరించి, అభిమన్యుడి వలె ముందు వెనుక ఆలోచించకుండా కదన సూనుకొని పద్మ వ్యూహంలోకి దూరిపోయి, ఆ ఉద్రేకంలో స్నేహ, బాంధవ్యాలూ తెగ్గతెంపులు చేసుకొని; దేనైనా, ఎంతైనా రెడీ అన్నట్లు తాను ఒంటరి వాడినై నప్పటికీ వెరపు లేదన్నట్లు వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు అడుగు వేస్తున్న వేడి రక్తపు పొంగు చల్లారని యువకుడు, భావోద్రేకి, వ్యక్తిగా పరమ సాత్విక స్వభావి, సంస్కారి, మెత్తటి మాటలతో ఎదుటి వారిని అట్టే బోల్తా కొట్టించ గలిగిన చతురత్వాన్ని ఒటిపటే నము పార్జించుకున్న వరగలి పెద్ద రైతు, శ్రీ యరటపల్లి జానకి రామిరెడ్డి తనయ కవితకి; మద్రాసులో స్థిరపడి, పారిశ్రామికంగా ఎంతో వృద్ధిలోకి రానున్న తరుణంలో అకాల మృత్యువాత పడిన విడవలూరు స్వర్గీయ పిన్నలూరు చంద్ర ప్రసాద్ రెడ్డి కుమారుడు, ఇంజనీరు రామచంద్ర రెడ్డితో పరిణయం 28 తేది నెల్లూరు చర్చి గ్రౌండ్స్‌లో వైభవంగా జరిగింది.

కుటుంబ 'పెద్దరికం' దూరమైన లోపం కన్పడకుండా పుండటాని కనుకుంటాము. పెండ్లి చాలా ఆడంబరంగా జరిపించారు జానకయ్య! అంత పెద్ద చర్చి గ్రౌండ్సునూ చలువ పంధిరితో కప్పించారు; ఆతిథ్య సేవలా ఆత్మీయంగా జరిపించారు.

* * *

నెల్లూరు, శ్రీ గొట్టిగుంటాల దశరథ రామిరెడ్డి కుమారుడు లక్ష్మి నరసా రెడ్డి, ఎవంబిఏ; శ్రీ అమాన వెంకట రంగా రెడ్డి సోదరి విజయలక్ష్మి ఎంఎస్‌సిల పెండ్లి 21 తేది రాజరాజేశ్వరి గుడిలో జరిగింది.

* * *

కాలేజి వదిలేసి పుష్కర కాలం దాటినా, రాజకీయ, ఆధ్యాత్మిక, వ్యాపార వ్యాపకాలు తలకు మించి తగిలించు కొని వున్నా ఇప్పటికీ పాలిటెక్నిక్ కాలేజి బలరామ రెడ్డి గానే పిలువ బడుతున్న రిటైర్డ్ ప్రిన్సిపల్ శ్రీ కొండా బలరామ రెడ్డి గారి సోదరుడు, డాక్టర్ కొండా వెంకట్రామ రెడ్డి కుమారుడు సునీల్ కుమార్ రెడ్డి; నెల్లూరు శ్రీ ఎం.జి. శేషా రెడ్డి కుమార్తె శ్రీ వల్లిల వివాహం 23 తేది టిటిడిలో జరిగింది.

* * *

కొరవ 7 పేజీలో

# ఐడిబిఐ బాండ్లు అమితంగా ఆకర్షిస్తున్నాయి!

## అటని తొందరపడి నిర్ణయం తీసుకోవద్దు!

ఇండస్ట్రియల్ డెవలప్ మెంట్ బ్యాంకు (ఐడిబిఐ) విడుదల చేస్తున్న డీప్ డిస్కౌంట్ బాండ్స్ ఇష్యూకు విపరీతమైన ఆదరణ లభిస్తున్నది. మధ్య తరగతి కుటుంబీకులు ఈ ఇష్యూ పట్ల అత్యధికంగా ఆకర్షితు లౌతున్నారు. ప్రైవేటు ఉద్యోగాల పై ఆధార పడేవారికి రిటైర్ మెంట్ తర్వాత పెన్షన్ వలె నికరాదాయం వస్తుందనే ఆశ కల్గడమే ఈ ఆదరణకు కారణం.

చాలా తెలివిగా జనం బలహీనతను సొమ్ము చేసు కోవడానికి పథకం రచించింది ఐడిబిఐ. 5300 లు కడితే రెండు లక్షలనే మొత్తాన్ని ఏదో జాక్‌పాట్ కొట్టినంత గొప్పగా విన్పింప జేస్తున్నారు. రెండు లక్షలతో పాటు పదేళ్ల పాటు పెన్షన్ అనే నినాదం ఎంతో ఆకర్ష ణీయంగా వుంది. ఈ పథకం చాలా తెలివిగా రూపొందించినది. ఇరవై ఐదేళ్ల తర్వాత రెండు లక్షలిచ్చే డీప్ డిస్కౌంట్ బాండ్ కాని; ఆ తర్వాత పదేళ్ల పాటు పెన్షన్ ఇచ్చే రిటైర్ మెంట్ బాండ్ కాని; తక్కిన రెండు బాండ్లు కాని ఐడిబిఐ మనకు చెల్లించే వడ్డీ మాత్రం 16 శాతం లోపే! ఇది నాటికి నెలకు రూపాయి 30 పైసల వడ్డీతో సమానం. ప్రతి సంవత్సరం అంతకం వేస్తూ, చక్రవడ్డీ పద్ధతిలో ఈ బాండ్లను రూపకల్పన చేశారు. చక్ర వడ్డీలో చాలా విచిత్రాలు జరుగుతాయి. మనం చెల్లించే

### షేర్‌లోకం

**డాక్టర్ ఎ.దుర్గాప్రసాద్**

రు 5300లు 2 లక్షలుగా ఎట్లా పెరుగు తుందో ఈ క్రింది పట్టిక చూడండి! ఐడిబిఐ ఇచ్చే 16 శాతం వడ్డీ, రూపాయిన్నర వడ్డీ, రెండు రూపాయల వడ్డీల లెక్కన ఇరవై ఐదేళ్లలో రూ. 5300 ల పెరుగుదల పట్టిక దిగువ ఇస్తున్నాము.

| సం. లు | 16 శాతం | 18 శాతం | 25 శాతం |
|---|---|---|---|
| 1 | 6148 | 6254 | 6625 |
| 2 | 7131 | 7379 | 8281 |
| 3 | 8272 | 8707 | 10351 |
| 4 | 9596 | 10275 | 12939 |
| 5 | 1131 | 12125 | 16173 |
| 6 | 12912 | 14307 | 20218 |
| 7 | 14978 | 16883 | 25272 |
| 8 | 17375 | 19922 | 31590 |
| 9 | 20155 | 23508 | 39488 |
| 10 | 23380 | 27739 | 49359 |
| 11 | 27121 | 32732 | 61699 |
| 12 | 31460 | 78624 | 77125 |
| 13 | 36494 | 45576 | 96406 |
| 14 | 42333 | 53780 | 120508 |
| 15 | 49107 | 63460 | 150635 |
| 16 | 56964 | 74883 | 188293 |
| 17 | 66078 | 88362 | 235367 |
| 18 | 76651 | 104268 | 294209 |
| 19 | 88915 | 123036 | 367761 |
| 20 | 103142 | 145182 | 459701 |
| 21 | 119644 | 171316 | 574626 |
| 22 | 138789 | 202153 | 718284 |
| 23 | 160993 | 238540 | 897855 |
| 24 | 186752 | 281477 | 1122318 |
| 25 | 216633 | 332143 | 1402898 |

పై పట్టికను చూస్తే 5 వేలు రెండు లక్షలయ్యే మ్యాజిక్ బోధ పడుతుంది. 16 శాతం వడ్డీకి ఈ మొత్తాన్ని ఐడిబిఐ బాండ్‌లో పెడితే పాతికేళ్లకు రెండు లక్షలైతే, మరి రెండు శాతం అదనపు వడ్డీకి 25 ఏళ్ల పాటు మార్చుకొంటూ వెళ్తే అదే మొత్తం 3 లక్షలా 32 వేలు అవుతుంది; రెండు రూపాయల వడ్డీకి అదే కాలానికి మార్చితే అదే రు. 5,300 లు 14 లక్షల రూపాయా లౌతాయి. చక్రవడ్డీలోని మ్యాజిక్ ఇదే! 25 శాతం వడ్డీ లెక్కన ఇరవై ఐదేళ్లకు ఐడిబిఐ చెప్పే రెండు లక్షల మొత్తం కావాలంటే ఇప్పుడు కేవలం రు. 755 లు పెట్టుబడి పెడితే చాలు.

గత పాతికేళ్లలో ఆర్థిక రంగంలో వచ్చిన మార్పులను పరిశీలిస్తే, రానున్న ఇరవై ఐదేళ్లలో వచ్చే మార్పులు అర్థం చేసుకోవచ్చు. 1970 - 1995 ల మధ్య వస్తువుల ధరలు ఆరు నుంచి పది రెట్ల వరకు పెరిగాయి. అంటే 1970 లో 500 రూపాయల జీతంతో కుటుంబం

> **రెండు లక్షలనేది మ్యాజిక్‌గా కన్పించినా గిట్టుబాటయ్యే వడ్డీ రేటు 16 శాతమే; అదే ఐదు వేలు 25 శాతానికి ఇదే కాలానికి మార్చితే 14 లక్షలౌతుంది!**

గడిస్తే, అదే స్థాయిలో ఇప్పుడు గడవాలంటే ఇప్పుడు 3 నుంచి 5 వేల రూపాయల జీతం కావాలి. ఈ లెక్క ప్రకారం ఇరవై ఐదేళ్ల తర్వాత ఇల్లు గడవాలంటే రు. 18 వేల నుంచి రు. 30 వేలు అవసర మౌతాయి. రిటైర్ మెంట్ బాండ్‌లో పెట్టుబడి ద్వారా పాతికేళ్ల తర్వాత తమ కుటుంబ పోషణకు గ్యారంటీ కల్పించు కోదల్చిన వారు 7 నుంచి 12 బాండ్లు కొనవలసి వుంటుంది. అంటే కనీసం 37 వేల పెట్టుబడి అవసరమన్న మాట. అయితే ఇదే 37 వేలను క్రమం తప్పకుండా రెండు రూపాయల వడ్డీకి మార్చుకో గల్గితే అదే పాతికేళ్లకు కోటి రూపాయలు చేతికి వస్తాయి. 18 శాతం వడ్డీకి మార్చుకొన్నాటం ఈ మొత్తం 23 లక్షలౌతుంది.

గత పాతికేళ్లలో వస్తువుల ధరలు పెరిగి నప్పటికీ వడ్డీ రేట్లు మాత్రం మారలేదు. అప్పుడు ఇప్పుడు కూడా రూపాయిన్నర నుంచి రెండు రూపాయల వడ్డీ పద్ధతి సాధారణ పరిస్థితులలో చలామణిలోనే వుంది. ఈ లెక్కలు ఎటు పోయినప్పటికీ ఐడిబిఐలో పెట్టుబడి పెడితే నమ్మకంగా తిరిగి వస్తుందనే విషయం అందర్నీ ఆకర్షిస్తున్నది. అది ఒక రకంగా నిజమే. కాని, ఇదే సమయంలో ఐడిబిఐ అంత

కొరవ 7 పేజీలో

# ఛీ.. ఛీ.. ఇంత దిగజారుడా?

ఎన్టీఆర్ మ్యూజియం తమ పరం చేసు కోవాలనే తాపత్రయంలో ఆయన కుమారులు, లక్ష్మి పార్వతి ప్రవర్తిస్తున్న తీరు పరమ జుగుప్సా కరంగా వుంది. వీధుల్లో అలగా జనం కంటే హీనంగా, సభ్యతా రహితంగా వ్యవహరిస్తున్నారు వారు.

ఇటు సినిమాలలో, అటు రాజకీయాలలో కూడా ఎన్టీఆర్ కోట్లాది రూపాయల ఆస్తులు ఆర్జించారు. అవినీతి గురించి మైకు పగిలి పోయేటట్లు కేకలు పెట్టే ఆయన - ముఖ్య మంత్రిగా పదవి నష్టం పెట్టుకొని, పెద్ద ఎత్తున అక్రమార్జన చేశారన్నది ఎవరూ కాదనలేని వాస్తవం. పదవిలో లేనప్పుడు కూడా పార్టీ నిధుల పేరుతో, విరాళాల పేరుతో కోట్లు మూట గట్టారన్నది నిజమే. తన సినిమా సంపాద నంతటినీ సంతానానికి పంచి పెట్టేసిన తర్వాత కూడా ఆయన దగ్గర అంతంత పెద్ద మొత్తాలలో డబ్బు సమకూ రిందంటే అది రాజకీయ ఆర్జనే కదా? కోట్లాది జన హృదయాలను రంజింప చేసిన ఒక మహా నాయకుడు మరణించిన తర్వాత ఆయన అక్రమార్జన, అవినీతుల గురించి చర్చించడం అంత మంచిది కాదు. అయితే దురదృష్టవ శాత్తు ఆయన వారసులే ఆ వ్యవహారాన్ని వీధుల్లోకి లాగు తున్నారు. ఎంతెంత ఎక్కడెక్కడ దాచి పోయిందీ కథలు కథలుగా జనం చర్చించుకునే వీలు కల్పిస్తున్నారు. స్వంత ఇంటి కలహాలకూ రాజకీయ రంగు పులిమి తాము భ్రష్టు పట్టడమే కాకుండా, రాజకీయాన్నే అపహాస్యం పాల్జేస్తున్నారు.

మ్యూజియం ఎదుట వేలాది మంది జనం సమక్షంలో లక్ష్మి పార్వతి, ఆమె అనుచరులైన ఎమ్మెల్యేలు సభ్యత మరచి, సంస్కారం విడిచి ప్రవర్తించడం గర్హనీయం. సంసార పక్షపు ముసుగు తొలగించుకొని, తన నిజ సంస్కారం బయట పెట్టుకొని, చవక బారుగా వ్యవహ రించారామె. తాను స్త్రీనని, ఎన్టీఆర్ వంటి మహోన్నత వ్యక్తిత్వం కల్గిన నాయకుడికి భార్యగా చలామణిలో వున్నదానినని, తననిప్పుడు యావత్ ఆంధ్ర దేశం గమనిస్తున్నదని మరచి పోయి ఛండాలపు బూతులు పూట్లాడడం, వీధిలో సీన్లు సృష్టించడం, పోలీసులను నీచమైన భాషలో తిట్టడం చేశారామె. ఎన్టీఆర్ కుమారులను మాత్రమే బూతులతో దీవించి వుంటే అది వారి స్వవిషయంగా పరిగణించి, ఛీ కొట్టి విస్మరించి వుండవచ్చు; కాని పోలీసు అధికారులను తిట్టడానికి ఆమెకు అధికారం ఎక్కడిది? అందరు పోలీసులు అక్కడ నిలబడి వున్నప్పుడు ఇంద్రారెడ్డి, బైరెడ్డి రాజశేఖర రెడ్డి, దేవినేని నెహ్రూ వంటి ఎమ్మెల్యేలు పచ్చి గూండాల వలె ప్రవర్తిస్తూ, కత్తులు, కటార్లు ప్రదర్శిస్తూ, తుపాకి చూపి బెదరిస్తూ వీరంగాలు చేయడ మేమిటి? పోలీసులు ఎందుకు సహించి వూరు కోవాలి ఇటువంటి దుండగాలను?

మ్యూజియం కోసం తాను, ఎన్టీఆర్ కలిసి కోట్ల రూపాయలు ఖర్చు పెట్టామని బహిరంగ ప్రకటన చేశారు లక్ష్మి పార్వతి గారు! తన ఆస్తినంతా పంచేశానని, తన దగ్గర బూడిద తప్ప మరేదీ లేదని పదే పదే చెప్పిన ఎన్టీఆర్‌కు ఆ కోట్లు ఎక్కడి నంచి వచ్చాయి? ఏ రూపంలో, ఏ వ్యాపారం చేసి సంపాదించారు? రామారావు చనిపోగానే లక్ష్మి పార్వతి పెద్ద మొత్తంలో డబ్బు, విలువైన వస్తువులు వున్న పెట్టెలు తరలించినట్లు వెంకటేశ్వర రావు గారు నిర్ధారించారు. ఈ డబ్బెక్కడి నుంచి వచ్చింది? ఎక్కడికి తరలి వెళ్లింది?

పదవుల్లోకి రాగానే ప్రజా ధనాన్ని కొల్లగొట్టి, కోట్లు కోట్లు మూటగట్టి పంపకాల కోసం ఇంత నిస్సిగ్గుగా వీధిన పడడం ఎన్టీఆర్ కుటుంబానికే చెల్లింది. దేశంలో ఏ ప్రజా నాయకుడి కుటుంబం కూడా ఇంత హేయంగా ప్రవర్తించలేదు. రాజకీయాల పరమావధి కేవలం ధనార్జనే అన్న నీచ సంస్కృతిని వంట బట్టించుకున్న వారు కావడం వల్లనే ఈ పరిస్థితి.

నెహ్రూ, శాస్త్రి వంటి త్యాగ ధనుల తరం సంగతి ప్రక్కన పెట్టి, రాజకీయాల దిగజారుడు దశలో దేశాధి పత్యం వహించిన ఇందిరా గాంధీ, రాజీవ్ గాంధీల విషయమే చూసినా వారికి; ఎన్టీఆర్‌కు ఎంత తేడా వుందా అన్పిస్తుంది. వారు పరమ పదించిన తర్వాత వారిదంటూ చెప్పుకోవడానికి చిల్లి గవ్వ ఆస్తి మిగలలేదు. వారి కుటుంబ సభ్యులకు వుండడానికి ఇల్లు కూడా లేదు. ప్రభుత్వ గృహంలో తలదాచుకొని వున్నారు సోనియా, ఆమె పిల్లలు. నెహ్రూ తమ పిత్రార్జిత గృహాలు రెండింటినీ ప్రభుత్వ పరం చేశారు. ఢిల్లీలో, అలహాబాద్‌లో వున్న రాజ ప్రసాదాల వంటి ఆ రెండు ఇళ్లు విలువ ఇప్పుడు వందల కోట్ల రూపాయలలో వుంటుంది.

ఎన్టీఆర్ కుమారులు కూడా తమ తండ్రి తమకిచ్చిన సంపదతో సంతృప్తి పడి, ఈ మ్యూజియం వంటి అదనపు ఆస్తులను ప్రభుత్వానికి స్వాధీనం చేసేయడం సముచితం. తండ్రి పరువు నిల్పడానికైనా వారు ఈ చవక బారు వీధి పోరాటాలు మానుకోవాలి.

•

అసలు ఎన్టీఆర్ ఆస్తి పాస్తులెంత, వాటిని ఆయనే విధంగా సంపాదించారు, ఎక్కడెక్కడ ఎంతెంత డబ్బు దాచి పెట్టి పోయారు, అది ఇప్పుడె క్కడుంది వంటి అంశాల పై విచారణ జరిపించడం అవసర మన్పిస్తున్నది.

లక్ష్మిపార్వతి, ఆమె అనుచర గూండా ఎమ్మెల్యేలు; రామారావు గారి కుమారులు, వారిని ఎగ ద్రోలుతున్న చంద్రబాబు ప్రభృతులు ఇక నుంచైనా కొంచెం సంస్కారంతో, తమను జనం చూస్తున్నారన్న స్పృహతో గుట్టుగా ఇంటి గొడవలు పరిష్కరించు కోగల్గితే రాష్ట్రం పరువు నిలుస్తుంది.

జమీన్‌రైతు

జమీన్‌రైతు

1.3.1946
వెం: 0-1-6 పేజీలు: 8

## జమీందారులకు కాంగ్రెస్ లొంగదు

### నెల్లూరు సభలో ఆంధ్రకేసరి గర్జన

"అహింసాయుత సత్యాగ్రహమునకే అలవడ్డ కాంగ్రెస్ నాయకులను ఒక్కొమ్మడిగా జైళ్లలో పడవేస్తే భారత దేశం తలెత్త కుండా పోతుందని భ్రమించి ఆగస్టులో దేశ నాయకు లందరినీ అరెస్టు చేసిన ప్రభుత్వాన్ని, ఒక్క మనిషిగా ప్రజా సముద్రం ఎదుర్కొంది. ప్రజా సముద్రంలో నుండి బయలు దేరిన అహింసాత్మక బడబానలమును చల్లార్చ ఎవ్వరి శక్యము కాదు" అని ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులు గారు నెల్లూరు తిప్పరాజా సత్రం వద్ద ఆజాద్ హింద్ సేవా దళం యాజమాన్యమున 27 తేది జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ ఇంకను వారిట్లన్నారు. ఎన్నికల అనంతరం ప్రజా పరిషత్తు నేర్పరచి, స్వతంత్ర భారత రాజ్యాంగమును రచించ బోతున్నాం: నట్టి యెన్నికలలో కాంగ్రెసును ఎదిరించే వారెవరైనా వుంటే నా ప్రజలు వారికి డిపాజిట్లు గూడ దక్కని ఘోర పరాజయం పాల్జేయ గలరని నాకు పూర్తి నమ్మకం గలదు.

జమీందారీ బిల్లు, పంచాయితీ బిల్లు, భూమి శిస్తు విధాన పునర్నిర్మాణముల బిల్లులు కాంగ్రెసు యీసారి తప్పక తీసుక వస్తుంది. గత కాంగ్రెస్ మంత్రి వర్గముల హయాంలోనే రావలసిన యీ బిల్లు యుద్ధము, మరికొన్ని పిశాచముల అటంకముల వల్ల అప్పట్లో రాలేదు. ఈ సారి అవి తప్పక వస్తాయి.

జమీందారులు కాంగ్రెసులోకి వస్తున్నంత మాత్రాన జమీన్‌రైతులు వెరగంద నవసరం లేదు. జమీందారులకు కాంగ్రెసు లొంగి పోదు. జమీందారులకు గాక, జమీందారీ రైతు ప్రజాను రంజకముగ మాత్రమే

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

కాంగ్రెసు వ్యవహరించ గలదని జమీందారీ రైతు ప్రజలకిదే నా అభయం అన్నారు.

సాయంత్రం నెల్లూరు నుండి బయలు దేరి నారాయణ రెడ్డి పేట, ఇందుకూరు పేట, మైపాడు, గంగపట్నం మున్నగు గ్రామాలలో జరిగిన సభల యందు ఉపన్యసించి రాత్రికి నెల్లూరు సభలో పాల్గొన్నారు.

పంతులు గారు తూర్పు గ్రామాల పర్యట నానుభవ మును గురించి తెల్పుతూ "ఆ ప్రబల వుత్సాహ తీక్షయము కాంగ్రెసు దిగ్విజయము సూచిస్తున్నది" అన్నారు.

కొరవరిప పేజీలో

# నకిలీ మందుల అమ్మకం అధికార్ల కళ్ళలో పడలేదా?

నెల్లూరు టౌన్‌లోని పలు మందుల షాపుల్లో నకిలీ మందులు అమ్ము తున్నారు. డాక్టర్ల వద్దకు పోలేని రోగులు, ప్రథమ చికిత్స కోసం మందుల షాపుల వారిని ఆశ్రయించి కొత్త జబ్బులు కొని తెచ్చు కొంటున్నారు. షాపుల వాళ్లు అమ్మే నకిలీ మందుల పైన అవి తయారైన తేది, బ్యాచ్ నెంబర్లు, ఊర్లు ఏవీ ఉండడం లేదు. ఈ మాత్రలు మింగిన వాళ్లకు కళ్లు కనిపించక పోవడం, తల తిరగడం, శరీరానికి నీరు పట్టడం జరుగుతుంది. ఈ నకిలీ మందులు బెంగుళూరు నుండి బస్సులలో కొందరు వ్యాపారస్తులు నెల్లూరుకు తెస్తున్నట్లు తెలుస్తోంది. నెల్లూరులో కూడా ఇటువంటి మందులు తయారు చేస్తున్నట్లు వినికిడి. మరి నకిలీ మందులు పని పట్ట వలసిన డ్రగ్ ఇన్స్‌పెక్టరు ఎందుకు మౌనం వహించి వున్నారో అర్థం కావడం లేదు.

కలిచేడు -మహబూబ్‌బాషా

జనవాణి

### బియిడి అభ్యర్థుల అన్యాయాలు!

త్వరలో జరుగనున్న టీచర్ల ఎంపిక పరీక్షల్లో పాల్గొన బోయే అభ్యర్థులు పలు అవినీతి పనులకు పాల్పడ బోతున్నారు. వివాహమైన అభ్యర్థులు, ఉద్యోగాలు చేస్తున్న తమ భార్యల చేత అప్లికేషన్లు వేయించి మళ్లీ పరీక్షలు వ్రాయిస్తున్నారు. వీరు తమ భార్యలను తమ సీటుకు సమీపంలోనే వేయించుకొని తెలియని సబ్జెక్టులలో కాపీ కొట్టేందుకు సర్వ సన్నాహాలూ చేసుకొని వున్నారు. ఒకే వూరు వారు వరుసగా ఒకే చోట పడేటట్లు ఏర్పాట్లు జరిగి వున్నాయన్న విమర్శ కూడా వినవస్తుంది. దీని వల్ల నీతిగా చదివే అభ్యర్థులకు కష్టాలు మొదలయ్యాయి. ఉపాధ్యాయుల నియామకం పరీక్షలను కలెక్టర్ గారు స్వయంగా పరీక్షించి న్యాయం చేయాలి.

నెల్లూరు జి. రామయ్య

### ఏ నాయకుడికి మచ్చలేదు?

రాబోయే లోకసభ ఎన్నికల్లో మచ్చలేని సచ్చరితులకు పార్టీ టిక్కెట్లు ఇస్తామని కాంగ్రెస్ పార్టీ ఘనంగా ప్రకటించింది. ఈ ఎన్నికల సందడిలో కుంభ కోణాల నుంచి తప్పించుకొను ఈ ప్రకటన చేసారేమో. కాని పలువురు కాంగ్రెసు నాయకులకు పలు కుంభ

కొరవ 7 పేజీలో

# రేషన్ కార్డుల సంఖ్య ఇళ్లను మించి పోయింది!

ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో అడిగిన వారందరికీ రేషన్ కార్డులు ఇచ్చే కార్యక్రమం చివరకు ఒక ప్రహసనంగా తయారయ్యింది. ఇటీవల కొత్తగా మంజూరు చేసిన రేషన్ కార్డులతో, పాత వాటి సంఖ్యను కలిపి చూస్తే జిల్లాలో ప్రభుత్వ లెక్కల ప్రకారం ఇళ్లు ఎన్ని వున్నాయో, రేషన్ కార్డులూ అన్నే వున్నట్లు తెలుస్తుంది. అంటే జిల్లాలోని ప్రతి ఒక్కరికీ రేషన్ కార్డు ఉన్నట్లే లెక్క. కాని గత వారంలో జరిగిన ప్రజల వద్దకు పాలన కార్యక్రమంలో కూడా మళ్లీ కార్డులు కావాలని ప్రజలు దరఖాస్తులు సమర్పిస్తుండడంతో అధికారులకు ఏమి చేయాలో పాలుపోని పరిస్థితి ఏర్పడింది. కొత్త రేషన్ కార్డులు కావాలని అత్యధికంగా దరఖాస్తు లందిన నెల్లూరు టౌన్‌లో జిల్లా పౌర సరఫరా అధికారి, ఆర్డీవోలు స్వయంగా పరిశీలన జరపాలని కలెక్టర్ ఆదేశించారు.

**ఇంకా ఇమ్మంటే పాపం అధికారులు ఎక్కడి నుంచి తేగలరు?**

జిల్లాలో ప్రభుత్వ లెక్కల ప్రకారం దాదాపు 6 లక్షలా 74 వేలగృహాలుంటే కొత్తగా ఇచ్చిన రేషన్ కార్డులతో కలిపి 6,55,078 మందికి రేషన్ కార్డులున్నాయి. అధికారులు జరిపిన దర్యాప్తులో 10 వేల కార్డులను బోగస్ కార్డులుగా గుర్తించి రద్దు చేసారు. లేకుంటే జిల్లాలో రేషన్ కార్డుల సంఖ్య 6,65,078 గా వుండేది. రెండవ విడత ప్రజల వద్దకు పాలన ముగిసే నాటికి జిల్లాలో లక్షా 18 వేల కొత్త కార్డులు కావాలని దరఖాస్తులు పెట్టుకున్నారు. వీరిలో 85,478 మందికి కార్డు లిచ్చారు. వీటిలో 68,463 తెల్ల కార్డులు, 19,015 గులాబి రంగు కార్డులు వున్నాయి. దరఖాస్తు చేసిన వారందరికీ కార్డులు మంజూరు చేసి వుంటే జిల్లాలో ఇళ్ల సంఖ్యను మించి అదనంగా 85 వేల కార్డులు చలామణిలో వుండేవి. జిల్లాలోకెల్లా అత్యధికంగా నెల్లూరు టౌన్‌లో

కొరవ 10 పేజీలో

ఆర్‌టిసి చెప్పిన నిజం

# డ్రైవర్ల నిర్లక్ష్యం వల్లే టౌన్ బస్ ప్రమాదాలు!

టౌన్‌లో జరుగుతున్న రోడ్డు ప్రమాదాలు 95 శాతం డ్రైవర్ల వైఫల్యం వల్లే జరుగు తున్నాయని ఆర్టీవో వై. జయ కుమార్ రెడ్డి చెప్పారు. 25 తేది టౌన్ హాల్‌లో భారతీయ మజ్దూర్ సంఘ్ ఆధ్వర్యంలో జరిగిన మోటారు కార్మికుల సదస్సులో ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడా రాయన. డ్రైవర్లు వాహనాన్ని నడిపే సమయంలో ఓర్పు, నేర్పు, సహనాన్ని ప్రదర్శించాలి. టౌన్ బస్సులకు అయ్యప్ప గుడి నుంచి ఆత్మకూరు బస్టాండు చేరేందుకు 35 నిమిషాలు కేటాయించాము. కాని ఈ సమయం చాలటం లేదంటున్నారు, ఇది సరైంది కాదు; నిర్ణీత స్పీడ్‌తో ఈ వ్యవధిలో ఆర్‌టిసి బస్సులు గమ్యాలను చేరుతున్నాయి. ప్రైవేట్ బస్సుల వారు స్టాపింగుల్లో ఎక్కువ సమయం వృధా చేయడం వల్లే సమస్యలు ఉత్పన్న మవుతున్నాయని ఆర్టీవో చెప్పారు.

**నెల్లూరు సంగతులు**

టౌన్‌లో ప్రైవేట్ బస్సుల స్పీడును 30 కిలో మీటర్లకు పరిమితం చేయ దలిచామని. ఆ పని ఆర్టీసి వర్క్ షాపులో చేసేందుకు ఆర్టీసి అధికారులు అనుమతించాలని కోరారాయన. మహిళల పట్ల సహనాన్ని ప్రదర్శించడాన్ని ప్రైవేట్ బస్సుల సిబ్బంది నేర్చు కోవాలని ఆర్టీవో సలహా యిచ్చారు. విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయే డ్రైవర్లకు లక్ష రూపాయలు చొప్పున ప్రభుత్వం సహాయం చేస్తుందని. దానికి డ్రైవర్లు దరఖాస్తు చేసు కోవాలని కోరారు. ఆర్టీసి రీజినల్ మేనేజర్ సీతారాం, ట్రాఫిక్ సిఐ పృథ్వీ నారాయణ, బి.ఎం.ఎస్. రాష్ట్ర కార్యదర్శి సాంబశివ రావు తదితరులు సభలో మాట్లాడారు.



ఫస్ట్ ఫ్లైట్ కొరియర్స్ ఆఫీసు ప్రారంభోత్సవం సందర్భంలో మున్సిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డికి మెమెంటో అందజేస్తున్న నిర్వాహకుడు మోహన్‌లాల్.

## సణుగుడు

* నడివీధిలోనా వినాయకుడి కోవెల?
* టౌన్‌ను అమ్మేస్తున్న టౌన్ ప్లానింగ్ అధికారులు

మద్రాసు బస్టాండు దగ్గర నెహ్రూ బొమ్మకు వాయవ్యంగా ఆచారి వీధి మొగుదాలలో ఒక వినాయక ఆలయం వెలుస్తోంది. రోడ్డును ఆక్రమించి, అదేదో తమ తాత సొత్తయి నంత దర్జాగా ఆక్రమించి ఆలయం కట్టించే స్తున్నారు. చిన్నా, చితకా గుడి కూడా కాదు; మండపం, ప్రాకారం, గోపురం, ధ్వజ స్తంభం వగైరా వగైరా ఆగమ శాస్త్ర నియమాలన్నీ పాటించి నిర్మిస్తున్నారు.

ఏమిటీ దుర్మార్గం? మద్రాసు బస్టాండు కూడలి అంటే ట్రాఫిక్ రద్దీ ప్రదేశం. ఇప్పటికే అక్కడ రోడ్డు చాలక తరచు వాహనాలు ఇబ్బంది పడ్తున్నాయి. టౌన్ ప్లానింగ్ నిబంధనలు గాలికి వదిలేసి ఇటు అటు కట్టిన షాపింగ్ కాంప్లెక్స్‌లతో రోడ్డు సగం మూసుక పోయి వుంది. రెండు అంగళ్ల ముందు నిలబెట్టే సైకిళ్లు, ఇతర వాహనాలతో రోడ్డు కుంచించుక పోయి ఒక్క బస్సు లోపలకు వెళ్లాలన్నా నరకం కన్పిస్తోంది. ఈ పరిస్థితిలో అక్కడ రోడ్డుకు అడ్డంగా దేవాలయం కట్టడమంటే, ఆచారి వీధికి ఈ వైపు నుంచి దారి మూసి పారేయడమే అవుతుంది.

లక్ష్మి దేవత దారి తప్పి తమ ఇంట్లో కాలు పెట్టడంతో కొత్తగా కోట్లకు పడగ లెత్తిన వారికి దైవ భక్తి మెండుగా వుండడం సహజమే. అయితే దాన్ని ప్రదర్శించు కోవడానికి జనం తిరిగే రోడ్డును ఆక్రమించడం ధర్మం కాదు. విఘ్నేశ్వరుడ్ని సంతృప్తి పరచ దల్చుకొంటే ఎక్కడైనా పదంకణాల స్థలం కొని పాల రాతి మందిరం కట్టిస్తే వద్దంటారా? అందుకు శక్తి లేని వారేమీ కారు కదా ఆ గుడి నిర్మాతలు?

మద్రాసు బస్టాండు వంటి కూడలిలో ఇటువంటి దురాక్రమణ జరిగి పోతుంటే టౌన్ ప్లానింగ్ అధికారులు ఏమి చేస్తున్నట్లు? మొదట్లోనే ఎందుకు ఖండరించ లేదు? ఎందుకు నివారించ లేదు? ఇప్పటికైనా మించి పోయింది లేదు - తక్షణం ఆ గుడిని దారికి అడ్డం లేకుండా తొలగించండి!

* * *

టౌన్ ప్లానింగ్ అంటే జ్ఞప్తికి వచ్చింది. నెల్లూరు మునిసి పాలిటీలో ఆ విభాగంలో పని చేసే అధికారులకు "నవ్వి పోదురు గాక మాకేమి సిగ్గు, ముఖాన ఉమ్మేద్దురు గాక, మాకేమి వెరపు" అన్న తత్వం బాగా వంట బట్టినట్లుంది. తమ ధన దాహంతో,

**డోలేంద్ర**

లంచాల కక్కుర్తితో నెల్లూరు టౌన్ ప్లానింగును నాశనం చేసేస్తున్నారు వారు. మరీ పచ్చిగా, బహిరంగంగా, నిస్సిగ్గుగా లేచుకొని తింటున్నారు. ఎక్కడ ఇటుక రాతి గుట్ట కన్పడినా, ఇసుక బండి కన్పడినా రాబందుల వలె వాలి పోతున్నారు. ప్లాన్ పెట్టి ఇల్లు కట్టే వారంటే వీరికి మహా చులకన; అటువంటి వారిని వెర్రి వాజమ్మల వలె పరిగణిస్తున్నారు. ప్లాన్లు గిన్లు లేకుండా అడ్డదిడ్డంగా ఇళ్లు, షాపింగ్ కాంప్లెక్స్‌లు కట్టే వారంటే వీరికి మహా ప్రీతి.

మామూలు ఖర్చులకు తోడు, ఒక మంత్రి గారి అదనపు వ్యయం ఇప్పుడు తమపైన పడిందని, అందువల్ల రేటు పెంచక తప్పడం లేదని చెప్పి ఇటీవల లంచాల రేటు విపరీతం చేసేశారట. అది ముట్ట చెప్తే చాలు - నడిరోడ్డులో వాకిలి పెట్టి కట్టినా, ఏ అనుమతి కోరకుండా నాలుగంతస్తుల భవంతి లేపినా కళ్లు మూసేస్తున్నారు; అది ఇవ్వని వారిని, ఇవ్వలేని వారిని అప్రూవుడ్ ప్లాన్ వున్నా పీడిస్తున్నారు.

కొరవ 8 పేజీలో

# స్మృత్యంజలి! మాతృదేవో భవః!



## స్వర్గీయ శ్రీమతి తిక్కవరపు రుక్మిణమ్మ గారు

స్వర్గీయ తిక్కవరపు బాబుల్‌రెడ్డి గారి ధర్మపత్ని
నిర్యాణం 1 మార్చి 1995

మమ్మల్ని మహోన్నత వ్యక్తులుగా తీర్చిదిద్దిన మా మాతృమూర్తి
మాకు దూరమై ఒక సంవత్సరం కాలగర్భంలో కలసి పోయింది.
ఆదర్శ గృహిణిగా.. అనురాగ దేవతగా.. ఆత్మబంధువుగా
అందరినీ అమ్మలాగ ఆదరించిన మాతృదేవత ఆమె!
అమ్మ చూపిన బాటలో.. అమ్మ ఆశయాలకు అణుగుణంగా
మానవసేవే మాధవసేవగా భావిస్తూ...
ఉజ్వల భవిష్యత్తులోకి నడుస్తాం!
కలకాలం మీ ఆశీస్సులు కోరుతూ...

**డా. టి. సుబ్బరామిరెడ్డి**
కుమారుడు

వరగలి జానకిరామిరెడ్డి కుమార్తె కవిత, రామచంద్రా రెడ్డి. వీరి వివాహం నెల్లూరు వైఎంసిఏ గ్రౌండ్స్‌లో 28 తేది జరిగింది.

అధికారిగా కాక మంచి స్నేహితుడిగా మెలిగే మృదు స్వభావి శ్రీ కె.వి. మాధవాచార్యులు తనయ హేమ వసంత లక్ష్మి; నరసారావు పేట శ్రీ కె.సి.హెచ్. ఆచార్యులు తనయుడు శ్రీధర శ్రీనివాసుల కళ్యాణం 28 తేది అచారి వీధిలోని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో జరిగింది.

* * *

## నెల్లూరుముచ్చట్లు

6 పేజీ కొరవ

### నెల్లూరు విద్యార్థికి బంగారు పతకం

నెల్లూరుకు చెందిన విద్యార్థి - యరబోలు సుజనేంద్ర రెడ్డి గుల్బర్గా విశ్వ విద్యాలయం రూరల్ ఇంజనీరింగ్ కాలేజీలో ఇండస్ట్రియల్ (ప్రొడక్షన్) విభాగానికి యూనివర్సిటీ ప్రథమురిగా స్థానం సంపాదించి. బంగారు పతకం అందుకున్నారు. ఆ పిల్లవాడికి 87.3 శాతం మార్కులు వచ్చాయట. ఆ విశ్వ విద్యాలయంలో ఇప్పటి వరకు ఇంత శాతం మార్కులు తెచ్చుకున్న ఇంజనీరింగ్ విద్యార్థి లేరట. ప్రశంస నీయమైన ప్రతిభ ఇది.

సుజనేంద్ర రెడ్డి - అల్లూరు దగ్గర మోపూరు రైతు కుటుంబీకుడు. శ్రీ యరబోలు ప్రభాకర రెడ్డి కుమారుడు; హస్తవాసి కల్గిన ఇఎన్‌టి స్పెషలిస్టు డాక్టర్ వైఎస్ రెడ్డి సోదరుని కుమారుడు. ఆ పిల్ల వాడికి మా శుభాభి నందనలు తెలియ జేస్తున్నాము.

### కోవి రామయ్య చౌదరి మరణం

పాత కాలం జిల్లా రాజకీయాలలో సంచలనాత్మక శాసన సభ్యుడిగా పేరు పొందిన శ్రీ కోవి రామయ్య చౌదరి 73 ఏళ్ల వయస్సులో 22 తేది రాత్రి కన్ను మూశారు.

1952 ఎన్నికల్లో ఉదయగిరి నుంచి ప్రజా పార్టీ అభ్యర్థిగా ఆయన డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారిని ఓడించారు. అనాటికి గోపాల రెడ్డి గారు జిల్లాలోనే కాక రాష్ట్రంలోనే ఒక స్థాయి, అంతస్తు కల్గిన కాంగ్రెస్ నాయకుడు; చౌదరి అనామకుడు. ఆ ఎన్నిక ఫలితం దేశ వ్యాప్త సంచల నానికి దారి తీసింది. ఆ తర్వాత 1962 లోనూ రామయ్య చౌదరిగారు మరొకసారి ఎమ్మెల్యేగా ఎన్నికైనారు.

ఆయనకు భార్య, ముగ్గురు కుమార్తెలు వున్నారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

3 పేజీ కొరవ

కోణాలతో సంబంధ మున్నదని రూఢిగా తెలిసి పోయింది. చివరికి పార్టీ అధినాయకుడు ప్రధాని పి.వి. నరసింహారావును కూడా అనుమానించ వలసి వస్తోంది. ఈ దశలో రాజకీయాల్లో మచ్చలున్న వారు తప్ప, మచ్చలు లేని వారు పనికి రారేమోనని ప్రజలు భావించాలా?

గుంపర్లపాడు -కె.వి.రమణ

## పెండ్లిండ్లు

2 పేజీ కొరవ

షామియానాలు, పాత్ర సామాను బాడుగకిచ్చే వ్యాపారానికి నెల్లూరులో ఆద్యుడు, ఎన్నేళ్ల నుంచో ఎందరెందరి పెండ్లిండ్లకో సేవ చేసిన శ్రీనివాస హైరర్స్ అధినేత శ్రీ పసుమర్తి వెంకట శేషయ్య కుమారుడు సతీష్ కుమార్; వెంకటం పేట, శ్రీ రాచపూడి రంగమన్నార్ అభిమాన పుత్రిక దీపిక దేవి పరిణయం 23 తేది పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది.

* * *

నెల్లూరు టౌన్ స్టేట్ బ్యాంక్ మేనేజర్లలో ఒకరు, ఖాతాదారులతో

## ఐడిబిఐ బాండ్లు

2 పేజీ కొరవ

నికరంగా నమ్మదగిన ఆర్‌బిఎఫ్ వంటి ప్రైవేటు కంపెనీలు చాలా వున్నాయి. వాటిలో 24 శాతం వడ్డీకి; మార్చుకొంటే అధిక మొత్తాలు చేతి కందుతాయి కదా?

మన డబ్బును మనం ఏ రూపంలో నిర్వహించు కున్నా కనీసం 24 శాతం ఆదాయం వచ్చే మార్గాలు ఎప్పటి కప్పుడు అన్వేషించ వచ్చు. మన డబ్బును పాతికేళ్ల పాటు ఇతరుల చేతికి ఇచ్చి మనం పూరికే వుండడం అవసరమా అన్నది ప్రశ్న.

ఈ బాండ్లలో పెట్టుబడి పెట్టే ముందు [illegible] అంశాలన్నింటినీ సమగ్రంగా పరిగణనకు తీసుకోవడం మంచిది.

## హత్యలో రాజకీయాలు

మొదటి పేజీ కొరవ

కాబట్టి కార్తికేయన్ ఇందులోని [illegible] విషాలని [illegible] వారికి తీయగలడనే భావించవచ్చు.

అయితే హత్య జరిగిన వెంటనే దొరికి పోయిన గణేశన్, డ్రైవరు ప్రకాశంలు తప్ప మరెవ్వరూ పట్టుబడ లేదని ఛార్జిషీటులో పేర్కొన్నారు. కాని హత్య తర్వాత వారం, పది రోజుల లోపల శ్రీకాకుళం ప్రాంతంలో పట్టుబడిన మరి ఇద్దరు నక్సలైట్ల విషయం ప్రస్తావించ లేదు. సాధారణంగా సిబిఐ ఇటువంటి దాపరికాలకు పాల్పడదు. వారి నుంచి ఇంకా సమాచారం రాబట్ట వలసి వుంది కాబట్టి ఆ విషయం దాచి పెట్టారా లేక అప్పుడు పట్టుబడిన వారికి ఈ హత్య కేసులో సంబంధమే లేదా అన్నది ప్రశ్నగానే మిగిలి పోయింది.

ఈ కేసుకు సంబంధించి పోలీసులను ప్రధానంగా వేధిస్తున్న సమస్య - నికరమైన సాక్షులు దొరకక పోవడ మేనంటున్నారు. హత్య జరిగిన సమయంలో, ఆ ప్రదేశంలో నూరు నూట యాభై మందికి పైగా సుబ్బరామి రెడ్డి గారి అనుచరులు, ఉద్యోగులు, ఇతరులు వున్నప్పటికీ, వారందరూ హత్యను, హంతకులను ప్రత్యక్షంగా చూసినప్పటికీ ఎవరికి వారు తమకేమీ తెలియదని, తాము ఆ దుర్ఘటనను సరిగా చూడలేదని చెప్పి తప్పించు కుంటు న్నట్లున్నారు. నక్సలైట్లకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్తే తమ ప్రాణాలకే ముప్పు అని భయపడ్తున్నట్లుంది. నమ్మకమైన అనుచరులుగా వుండిన వారూ ముఖం చాటేస్తున్నారట.

ఏది ఏమైనా సిబిఐ అధికారులు తమ ఛార్జిషీటులో రాజకీయ ప్రమేయం పై మౌనం వహించడం దురదృష్టకరం. ఆ కోణంలో తమ దర్యాప్తు వివరాలను వారు సూచాయగానైనా పేర్కొని వుంటే బాగుండేది.









### కందుకూరు సబార్డినేటు జడి కోర్టులో

E.P. No. 48/1988 in
O.S. No. 40/1981

శ్రీ కోదండరామ స్వామి వారి దేవస్థానం, బుచ్చిరెడ్డి పాలెం రెప్రజెంటెడ్ బై యిట్స్ హెరిడిటరి మేనేజింగు ట్రస్టీ శ్రీ దొడ్ల పాండురంగా రెడ్డి -వాది /DHr

Vs

పల్లపోలు ఆదిరెడ్డి -ప్రతివాది/JDr

పై కోర్టు వారి యెదుట 8.3.1996 తేది పగలు 10.30 గంటలకు షెడ్యూలు ఆస్తిని యాలం జరుప బడును. [illegible] వారు [illegible] వలసినది.

#### షెడ్యూలు

నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా, కందుకూరు మండలం కోవూరు గ్రామంలో T.D. No. 470 పట్టా నెం. 400, సర్వే నెం. 439, య 192.55 ట్లు (77.98 Hc) లో య5.45 ట్లు (2.203 Hc) మెట్ట భూమికి హద్దులు:

తూర్పు: కాకుమాని వెంకటేశ్వర్లు తాలూకా 33వ నెంబరు ప్లాటు భూమి, దక్షిణం: కందుకూరు గ్రామసత్రం, పడమర: కొత్త సుబ్బారావు తాలూకు 31వ నెంబరు ప్లాటు భూమి, ఉత్తరం: దారి. యీ హద్దులు లోని య5.45 ట్లు (2.203 Hc) మెట్ట.

Sale on 8.3.1996
F.H. 15.3.1996

వాది క్రయం రూ. 5000.00
అమీనా క్రయ... రూ. 13320.00

కె. సత్యనారాయణ
వాది ఆడ్వ...


### ఆమోఘరైతు

సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సరం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-






### నెల్లూరు మూడవ అదనపు డిస్ట్రిక్ట్ మున్సిఫ్ కోర్టులో

అసలు దావా నెం. 150/1995

జక్కా వెంకట రమణారెడ్డి -వాది

Vs

జక్కా నరసింహా రెడ్డి -ప్రతివాది

#### ప్రకటన

కోర్టు వారి ఉత్తర్వు ప్రకారం ఈ క్రింద వివరించిన దావా షెడ్యూలు దాఖల భూమిలోని ఈ సంవత్సరం అనగా ఆగస్టు నెల ఆఖరు వరకు వచ్చు మామిడి చెట్ల ఫలితమును బహిరంగముగా మక్తాపురం గ్రామములో 3.3.96 న ఉ. 10.00 గంటలకు వేలము వేయబడును.

#### షెడ్యూల్

Ac. 16-40 cents of dry land comprised in Survey Nos. 153, 152, 151/1, 150/1, 154, 156, 149/B, 155, 172, 173, 171, 169, 176 and 174 of Gollakondukuru, Nellore Rural Mandal along with a Mangoe - garden situated theirin within the following boundaries: East: The land of Jakka Audemma and Jakka Janardhan Reddy; South: The assessed waste land of the Government; West: Assessed waste land of the Government and the land of Dodla Chenchurama Reddy and others to some extent; North: River Poramboke.

Market Value is Rs. 85,050/-

As also 1/4 joint right in the donka leading thereto.

యం. రామచంద్రారెడ్డి
అడ్వకేట్ రిసీవర్

## జిల్లావార్తలు

11 పేజీ తరువాయి

స్వయంతో త్వరలో మంచి నీటి ట్యాంకును నిర్మించ నున్నట్లు తెలుగు దేశం (బాబు) పార్టీ నాయకుడు బెజవాడ ఓబుల రెడ్డి తెలిపారు. ఈ ట్యాంకు నిర్మాణానికి నిధులు కూడా మంజూరయ్యాయి.

నిర్మాణానికి అవసరమైన ఎనిమిది లక్షల్లో ఆరు లక్షలు పంచాయితీ రాజ్ శాఖ మంత్రి రాష్ట్ర నిధి నుండి సమకూరు స్తున్నారని, అల్లూరు శాసన సభ్యులు జక్కా వెంకయ్య లక్ష రూపాయలు మంజూరు చేశారని, మిగిలిన లక్ష రూపాయలను గ్రామంలో విరాళాల ద్వారా సేకరించ వలసి ఉందని తెలిపారు.

గ్రామంలో పంచాయితీ కార్యాలయం వద్ద ఉన్న ట్యాంకు పరిమాణానికి మించి కొళాయిల కనెక్షన్లు ఇవ్వడంతో కోనేటిమిట్ట, కోమటి బజారు మొదలైన ప్రాంతాల వారికి మంచి నీటి సరఫరా సరిగా జరగడం లేదు. నూతనంగా ఈ నిర్మాణం జరిగితే ఆ ప్రాంతాలలో ఈ సమస్య పరిష్కారం అవుతుంది.

### వార్తతో మేలుకొన్న ఎక్సైజ్ శాఖ!

గూడూరు రైల్వే పోలీసులు మద్యం వ్యాపారులుగా మారిన విషయమై గతవారం 'జమీన్‌రైతు' లో వచ్చిన వార్త ఆ శాఖలో చర్యకు దారి తీసింది. తమ శాఖ పరువు పోతున్నదని తెలుసుకొన్న రైల్వే శాఖ పోలీసులు, ఎక్సైజ్ పోలీసులతో రాజీ చేసుకొని 25 తేది సంయుక్తంగా వివిధ రైళ్లలో దాడి చేసి 204 బాటిళ్ల మద్యం పట్టుకొన్నారు. ఆ రోజు మద్రాసు నుండి వచ్చే చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో వరంగల్ జిల్లాకు చెందిన సోమలాల్ అనే వ్యక్తిని అరెస్టు చేసి, సైకిల్ ట్యూబు సహాయంతో అతని తొడకు చుట్టుకొని వున్న 9 మద్యం సీసాలు స్వాధీనం చేసుకొన్నారు. జి.టి. ఎక్స్‌ప్రెస్ లేడీస్ కంపార్ట్‌మెంట్‌లో ఎక్సైజ్ సిఐ మాలకొండయ్య స్వయంగా తనిఖీ చేస్తుండగా 195 మద్యం ఆఫ్ బాటిల్స్ దొరికాయి. కాని ఈ సరకు తెస్తున్న వారిని పోలీసులు పట్టుకోలేక పోయారు. ఇదే హుషారును ఎక్సైజ్, రైల్వే శాఖలు కొనసాగిస్తే తమ పరువు గంగపాలు కాకుండా అక్రమ మద్యాన్ని అరికట్ట గలుగుతారు.


Statement about ownership and other particulars about the News Paper

**ZAMIN RYOT** (Telugu Weekly)

NELLORE - 524 004 - ANDHRA PRADESH

**FORM - IV** (See Rule 8)

1. Place of Publication : 3rd Cross Street, Savithri Nagar, NELLORE - 524 004. (AP)
2. Periodicity of Publication : Weekly
3. Printer's Name : N. Dolendra Prasad
   Nationalilty & Address : Indian, Santhi Nagar, NELLORE - 524 003.
4. Publisher's Name : - do -
   Nationality & Address
5. Editor's Name : - do -
   Nationality & Address
6. Name and Addresses of the individuals who own the news paper and partners or Share holders holding more than one percent of the total capital.

ZAMIN RYOT-COMMITTEE

1. Sri T. Vanamali : Secretary
   3rd Cross Street, Savithri Nagar, NELLORE - 524 004.
2. Sri N. Dolendra Prasad : Member
   Santhi Nagar, NELLORE - 524 003.
3. Sri N. Kosal Ram : Member
   3rd Cross Street, Savithri Nagar, NELLORE - 524 004.
4. Sri N. Yamini Chandra : Member
   Manager - Andhra Bank, S.V. University Campus, TIRUPATI

I, N. Dolendra Prasad here by declare that the particulars given above are true to the best of my knowledge.

**N. DOLENDRA PRASAD, Publisher**


## కోవూరులో కరువు

11 పేజీ తరువాయి

కూడా పూర్తి చేశారట. ఆ రోజు నుండి పాపమా నిరుద్యోగ యువకుడు ఫస్టులిస్టులోని తన పేరు వస్తుందనే ఆశతో ఎదురు చూశాడు. ఆ లిస్టు విడుదలయ్యాక మళ్లీ కాని అందులో రాలేదు; మళ్లీ రెండవ లిస్టు కోసం చూడసాగాడు. కాని ఆ ఆశనూ విరాళ పరుస్తూ ఈ నెల 21 తేది అతనికి సంబంధించిన ఒరిజినల్ సర్టిఫికెట్లను బెటాలియన్ అధికారులు త్రిప్పి పంపారు. కానిస్టేబిల్ వుద్యోగం గ్యారంటీ అనే నమ్మకంతో కృష్ణారెడ్డి వేరే వుద్యోగాలకు దరఖాస్తు చేయలేదట; చేద్దామన్నా అతని చేతిలో సర్టిఫికెట్లు లేకుండా పోయాయి. ఇప్పుడు సర్టిఫికెట్లు తిరిగి వచ్చే సరికి అతనికి వుద్యోగం పొందే వయోపరిమితి దాటి పోయింది. దీనితో ఏమి చేయాలో తెలియక కొట్టు మిట్టాడుతూ ప్రతి ఒక్కరి వద్దా తన బాధ వెళ్ల బోసుకొంటున్నాడు. ఎస్పీ గారూ, ఈ నిరుద్యోగి నియామక విషయం ఒక సారి మీరు పరిశీలించి న్యాయం చేయండి!

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

రాంబాబును నిలదీసి నప్పుడు రాంబాబు తన జీవిత కథ చెప్తాడు. ఫ్లాష్ బ్యాక్ అక్కడ ప్రారంభ మవుతుంది. కథను ఎక్కడా ప్రక్క దారులు తొక్కించ నీకుండా, అడ్డ దారుల నుంచి చిల్లర మల్లర విషయాలను మూల కథలోకి జొర బడ నీకుండా కథను రూపుదిద్దాడు దర్శకుడు. చిత్రం ముందు భాగంలో రాంబాబు పేకాట వ్యసనాన్ని, పేకాటకు బానిసలైన మూర్ఖులకు కనువిప్పు కలిగే విధంగా ఒక హిత బోధగా చూపబడింది. పెళ్లయిన తర్వాత కూడా రాంబాబు పేకాట మానక పోవటం, బామ్మ జబ్బు బాగు చేయిం చేందు కోసం భార్య తన మంగళ సూత్రం యిస్తే, దాన్ని అమ్మి పేకాటలో అంతా పోగొట్టుకొని ఇంటికి రావటం, బామ్మ చనిపోవటం ఈ సన్నివేశాలు ప్రేక్షకులను కదిలిస్తాయి. రాంబాబు సంసారంలో సెంటి మెంటు బాగా చూపబడింది. చివరన హంతకుడు నరసింహాన్ని రాంబాబు దారుణంగా హత్య చేసిన పతాక సన్నివేశం అబ్బుర పరుస్తుంది. చిత్రమంతా దర్శకుని ప్రతిభ కనిపిస్తుంది. ఇది దర్శకుని చిత్రం.

రమ్యకృష్ణ వైవిధ్యంతో కూడుకున్న పాత్రలో రాణించింది. మోనికా బేడి చిన్న పాత్రలో పెద్దగా నటించింది. బ్రహ్మానందం తనదైన ఫక్కీలో సున్నితమైన హాస్యాన్ని అందించి ఆనందపరిచాడు. సత్యనారాయణ, భరణి, మోహన్ రాజ్, నిర్మల వీరి ఉత్తమ నటన చిత్రం విజయానికి తోడ్పడింది. ఎం.వి. రఘు ఫోటోగ్రఫీ గూడా సహకరించింది.

సత్యమూర్తి వ్రాసిన మాటలు బలంగా కుదిరాయి. కోటి సంగీతం నేపథ్యంలోను, పాటల్లోను అభి నందించ తగింది. ఏసుదాస్, • చిత్ర పాడిన కొండకోన పాలైన సీతమ్మ మదిలోన పాట మళ్ళీ వినాలని పించేదిగా వుంది.



గుల్బర్గా యూనివర్సిటీ రూరల్ ఇంజనీరింగ్ కాలేజ్ బాల్కీ నుండి 1995 సంవత్సరంలో ఇండస్ట్రియల్ ప్రొడక్షన్‌లో యూనివర్సిటీ మొదటి ర్యాంక్ సాధించి 19.1.96 న జరిగిన కాన్వొకేషన్‌లో కర్నాటక విద్యామంత్రి మంజునాథ్ వద్ద నుండి బంగారు పతకాన్ని అందుకుంటున్న యరబోలు సుజనేంద్రరెడ్డి.

సంక్రాంతి వచ్చే తుమ్మెద పాట గూడా విన తగింది. కుటుంబ సమేతంగా చూడతగ్గ చిత్రం సోగ్గాడి పెళ్లాం.

## సణుగుడు

4 పేజీ తరువాయి

చంపుతున్నారు.

పూర్తిగా అధికారుల రాజ్యంలో ఇటువంటి దుర్మార్గాలు జరగడంలో అర్థం వుంది; కాని ఎన్నికైన కౌన్సిల్ వున్నప్పుడూ ఇంత బరితెగించి ప్రవర్తిస్తుంటే వారి ఆటలెందుకు సహిస్తున్నారు?

ఒక్క అధికారి, నలుగురు సిబ్బంది లంచాల వ్యామోహానికి టౌన్‌లో పౌర జీవితం శాశ్వతంగా నరక తుల్యం కావలసిందేనా? వీధులు అరుకు మయం కావలసిందేనా?

50 ఏళ్ళ క్రితం
3 పేజీ తరువాయి

## నెల్లూరు ముచ్చట్లు

### ఎలెక్షన్

అంతరంగిక సముద్రంలో చెలరేగిన తుఫాను ఇంకా పూర్తిగా శాంతి పొందలేదు.

**అలజడికి కారణం**

అయితే యీ అలజడికి కారణ మేమిటని స్థూలంగా విచారించడం అవసరం. గత పర్యాయం 1937 లో గూడూరు, కందుకూరు డివిజన్‌లలో జమీందార్ల మీద పోటీ వేయడానికి మనిషే దొరకలేదు. అంత పెద్ద జమీందార్లతో మోటు కోవడానికి తగిన అంగ బలం, అర్థ బలం వుంటేనే గాని సాధ్యం కాదాయె. ఆనాటికి వెంకట నారాయణ రెడ్డి, పెరుమాళ్ళ నాయుడు గారలు ధైర్యంగా ఒప్పుకోవడం, వెనుక ప్రక్క తిక్కవరపు రామిరెడ్డి గారి లాంటి పెద్దలు వెన్నుదట్టి ఆదుకోవడం జరిగింది. దీనికి తోడు కావలి డివిజన్‌లో 18 తేది ఎన్నికలై పోయి అక్కడ గెలుపొందిన ఉత్సాహం ఉద్వేగంతో బాటు గోపాల రెడ్డి గారి మంది మార్బల మంతా 20 తేది గూడూరు, కందుకూరు డివిజన్ల మీద దూకడంతో విజయ ఢంకా మ్రోగింది. అట్లే కావలి డివిజన్‌లో గూడా జస్టిసు కోటను పడగొట్ట డానికి యే యుద్ధ లక్షణాన్నో పాటించి కావలసి వచ్చింది. అందువల్ల 1937 లో ఎన్నికలకు పూను కోవడ మంటే మహా కష్ట సాధ్యమైన పనిగా ఏర్పడ్డది. అందువల్ల ఎవరూ పూనుకోలేదు. ఈనాడో ఆ మూడు డివిజన్‌లలో కాంగ్రెసు వారు ఎవర్ని నిలబెట్టినా నిరాఘాటంగా సులభంగా గెలుస్తారనే నమ్మకమైన పరిస్థితి ఏర్పడింది. కాబట్టి యీనాడు ఈ స్థానాలకు యింత పోటీ, యింత అలజడి హెచ్చింది. కావున వెనుకటి కష్ట పరిస్థితుల కంటే నేటి సులభ పరిస్థితులే యీ హెచ్చు మంది అభ్యర్థులను లేపి అలజడి కలిగించడానికి కారణం.

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9674 | 5500/- |
| 9672 కొత్తవి | 3600/- |
| 9672 పాతవి | 5000/- |
| సన్నాలు | 3600/- |
| మొలగొలుకు బియ్యం 70 కి | 750/- |
| బంగారు సవర 8 గ్రా | 4000/- |
| వెండి 10 గ్రా | 80/- |

## పంచాంగం

### సుమువార్తములు

7 తేది గురువారం ఉదయం 2.38 గంటలకు ధనుర్లగ్నమున గృహ ప్రవేశ, వివాహములకు

ఉదయం 9.12 గంటలకు మేష లగ్నమున గృహారంభ వివాహ వ్యాపారములకు సుముహూర్త మున్నది.

### మార్చి తిథులు

ఫాల్గుణ శుద్ధ

తే 2 శని ద్వాదశి ఉ.గ. 10.13 వ

తే 3 ఆది త్రయోదశి ప.గ. 12.0 వ

తే 4 సోమ చతుర్దశి ఉ.గ. 1.38 వ

తే 5 మంగళ పూర్ణిమ ప.గ. 2.50 వ

ఫాల్గుణ బహుళ

తే 6 బుధ పాడ్యమి సా.గ. 3.34 వ

తే 7 గురు విదియ సా.గ. 3.45 వ

తే 8 శుక్ర తదియ సా.గ. 3.43 వ

-స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

# ముద్దంటే చేదంటే నువ్వే వద్దంటారు తెలుగు నిర్మాతలు!

[illegible] ఒక పద్ధతి అంటూ లేక పోతోంది! ఇటీవల సినిమా, పెకెటి కవరాపు మనుమడు, తమిళ హీరో ప్రశాంత్ ఒక ప్రకటన చేయడానికి ప్రెస్ మీట్ ఏర్పాటు చేశారు. "ఇటువైన నా సరసన నటించే ఏ నటికి ఇంగ్లీష్ కిస్ వంటి పెదవులు కలుసుకునే ముద్దు ఇవ్వను అని ఆ ప్రకటన. ఆ నిర్ణయానికి కారణం వివరి కరిస్తూ, "అభిమానుల ఉత్తరాలే కారణం" మీరు నటించే చిత్రాల్లో మీరు చుంబించే దృశ్యాలు కొన్ని దానిలో అతను చుంబించే దృశ్యం ఉంది. ఆ నిర్మాతను ప్రశాంత్ తండ్రి త్యాగరాజన్ నిలదీశారు. ఇదేమిటి? "మా అబ్బాయి ఒక్కడే హీరో కదా మీ చిత్రంలో? ఇంకో హీరోను కొత్తగా ఎందుకు బుక్ చేశారు?" అని "అయ్యా! ఈ రోజుల్లో ప్రతి చిత్రంలోనూ కిస్సింగ్ పాట్స్ లేకపోతే డబ్బులు రావు. కాని, మీ అబ్బాయి అటువంటివి వేయనన్నారు కదా? అందుకే, ఆ పనికి మరొకర్ని బుక్ చేయక తప్పలేదు" అన్నారు పవిత్రన్.

### హీరో ప్రశాంత్‌కు ఎదురైన చేదు అనుభవం

అంతటం మూలంగా మహిళలు జుగుప్స చెందుతున్నారు. అది మానేయండి యావత్తు ఫామిలీ తరలి వచ్చి చూసి తరించే చిత్రంగా మలచండి అని వేడుకుంటున్నారట బాగానే వుంది. ప్రశాంత్ మార్గ దర్శకుడయ్యాడని అభినందించే లోగా మరొక మలుపు 'కల్లూరి వాసల్' అనే తమిళ చిత్రం పవిత్రన్ దర్శకత్వంలో రెండు షెడ్యూల్స్ ముగిసింది. అందులో ప్రశాంత్ హీరో, అయితే వున్నట్లుండి కొత్తగా అజిత్ కుమార్ అనే నటుడ్ని బుక్ చేశారన్న విషయం తెలియగానే చాలా మంది నిర్ఘాంత పోయారు. విచారించగా తేలిం దేమిటంటే మెల్లమెల్లగా బిజీ అవుతున్న అజిత్ కుమార్‌కు ఆ చిత్రంలో రెండే రెండు సీన్లు పెట్టారట. ఒక

### నాగార్జున, టాబూలతో నిన్నే పెళ్లాడుతా!

గులాబీ తర్వాత కృష్ణ వంశీ దర్శకత్వం వహించే అన్నపూర్ణ స్టూడియోస్ "నిన్నే పెళ్లాడుతా" చిత్రంలో నాగార్జున, హిందీ నటి టాబు, లక్ష్మి, కవిత, రమాప్రభ, మంజు భార్గవి, చంద్ర మోహన్, చలపతి రావు, జీవా, ఎ.వి.ఎస్. ప్రసాద్, గిరిబాబు, బెనర్జీ, బ్రహ్మాజీ, బోస్, ఉత్తేజ్ పాత్ర ధారులు. సంగీతం: సందీప్ చౌతా. దర్శకత్వం: కృష్ణవంశీ.

### నాగార్జున నటించే రాముడొచ్చాడులో కృష్ణ

నాగార్జున, కృష్ణ కలిసి కనిపించే సీన్‌లు వుండవు. ఫ్లాష్ బ్యాక్ సీన్లలో నాగార్జున తండ్రిగా కృష్ణ కనిపిస్తా రంతే. ఐతే, కృష్ణ సరసన సుహాసిని నటించింది" అన్నారు ఎ. కోదండ రామిరెడ్డి. సత్యనారాయణ, జయంతి మున్నగు వారు కూడా ఉన్నారీ చిత్రంలో. ఏప్రెల్‌లో విడుదల చేయాలను కుంటున్నాం అన్నారు నిర్మాత యార్లగడ్డ సురేంద్ర.

అడవిదొంగ చిత్రంలో విజయశాంతి, సంగీత, సురేంద్రపాల్

*జయప్రద వలె పదవి రాదనేగా ఈ పుల్లటి ద్రాక్ష కబుర్లా?*

# రాజకీయాల్లోకి రాకుండానే ప్రజా సేవ చేయనున్న విజయశాంతి!

ఇటీవల జయప్రద, శారద ఇద్దరూ రాజకీయాల్లోకి ప్రవేశించారు. అందులో జయప్రద రాజ్యసభకు ఎన్నికయ్యారు. అయితే నాకలాంటి ఉద్దేశ్యం లేదు. రాజకీయ రంగంలో ప్రవేశించ కుండానే ప్రజలకు ఏ విధంగా సేవ చేయడానికి వీలవు తుందో భవిష్యత్తులో నా పథకాన్ని విపులీ కరిస్తాను అన్నారు విజయ శాంతి. మద్రాసులో మార్చి 22నుండి ప్రారంభమయ్యే హిందీ చిత్రంలో అమితాబ్ బచన్ సరసన నాయికగా నటించడం తనకు ఎంతో సంతోషంగా ఉందన్నారు. ఈమె నటించే గూండాగిరి చిత్రానికి ఇంకా 20 రోజుల పని ఉందన్నారు. ఎ. కోదండ రామిరెడ్డి దర్శకత్వంలో అడవి రాణి చిత్రానికి ఇంకా నెల రోజుల కాల్ షీట్లు ఉన్నాయన్నారు. అడవి దొంగ, నాగకన్య చిత్రం మేలో విడుదల వుతుందట. తన గురించి ఈ మధ్య పత్రికలలో ఏ మాత్రం వార్తలు వుండక పోవడంతో విజయ శాంతి చాలా కాలం తర్వాత ప్రెస్‌మీట్ ఏర్పాటు చేసినట్లుంది.

### భర్త గురించి డిస్కోశాంతి

ఫిబ్రవరి 21 ఉదయం (బుధ వారం) డిస్కోశాంతి, నటుడు శ్రీహరిని తిరుమలలో పెళ్ళి చేసుకొని, చక్కా మద్రాసుకు చేరుకుంది. అప్పుడామె చెప్పిన విషయాలు. "ఐదేళ్ల క్రితం నేను ఒక తెలుగు చిత్రంలో డాన్స్

## మద్రాసు సినిమా వార్తలు

చేసినప్పుడు శ్రీహరిగారితో హైదరాబాద్‌లో తొలి పరిచయం ఏర్పడింది. ఆయన ఆ చిత్రంలో విలన్. అంత వరకు మగ వారిని గురించి గాని, నా వివాహం గురించి కాని ఆలోచించి ఎరుగను. ఎందుకో ఆయన నా మనసుకు నచ్చినట్లని పించింది. వేసేది విలన్ వేషాలైనా ఆయన సహృదయుడని అనిపించింది. అంతే, ఆ తర్వాత ఆయన గురించి ఆలోచించడం మానేశాను. నా కాల్‌షీట్లతో బిజీగా ఉండి పోయాను. రెండో సారి రాజమండ్రిలో నేను మరెదో చిత్రంలో డాన్స్ చేస్తున్నప్పుడు, ఆయన హఠాత్తుగా వచ్చి పలుక రించారు. కుశల ప్రశ్నలు వేశారు. కాయల్ హిందీ చిత్రంలో నా డాన్స్ తనకు బాగా నచ్చిందన్నారు. హిందీ చిత్ర నిర్మాతలు డాన్స్ ముగించిన వెంటనే డబ్బు చెల్లించేసి, బొంబాయి నుంచి విమానంలో పంపిం చేస్తారు. ఏ లోపం రాకుండా చూసుకుంటారు. తెలుగులో గాని, తమిళం గాని ఎంత కష్టపడి చేసినా అంత సులువుగా పారితోషికాలు ముట్టవు కదా?" అన్నాను. "ఎందుకీ అవస్థ హాయిగా నా వంటి వాడినొకన్ని పెళ్ళి చేసేసు కోవచ్చు కదా?" అన్నారు. నిర్ఘాంత పోయాను. అది వరకెన్నడూ నాతో అంత ధైర్యంగా ఎవరూ మాట్లాడ లేదు. మౌనం అంగీకారంగా భావించవచ్చా? అని మళ్లీ ఆయన అడిగారు. ప్రస్తుతానికి ఓకే గాని నాకు కొన్ని బాధ్యత లున్నాయి. నాన్న పోయాక మా కుటుంబాన్ని పోషించే బాధ్యత నా మీద పడింది. పెద్ద కూతుర్ని నేను. నా తర్వాత ఒక తమ్ముడు, ఒక చెల్లెలు, తమ్ముడు, చెల్లెలు ఇలా వరుసగా ఏడుగురిని కన్నది మా అమ్మ. ఒక చెల్లెలి పెళ్లి చేశాను. మిగతా వారందరికీ ఏదైనా దారి చూపాలి. అంత వరకు నా పెళ్ళి మాట గప్ చిప్ అన్నాను. ఈ మాట నేను చెప్పి దాదాపు మూడేళ్లు అయ్యి ఉంటుంది. ఈలోగా అందరికీ నేను చేయ వలసిన బాధ్యతలు ఒక్కొక్కటిగా ముగించాను.

కొరవ 10 పేజీలో

**సున్నితమైన హాస్యం, పటుత్వం కలిగిన కథ, మంచి దర్శకత్వం**

# సోగ్గాడి పెళ్ళాం

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

సోగ్గాడి పెళ్ళాం చిత్రంలో సోగ్గాడు రాంబాబు (మోహన్ బాబు). రాంబాబు పాత్రకు మంచి ప్రాముఖ్యత వుంది. అతనికి రెండు ముఖాలున్నాయి. ఒకటి తన ఊళ్ళో పెద్దరికం వెలగ బెట్టుంది. వారసత్వంగా సంక్రమించిన పెద్ద రికంతో ఆ ఊళ్ళో జరిగే తగాదాలకు తీర్పు చెప్పి పెద్ద మనిషిగా పేరు పొందు తుంటాడు. ఇక రెండో ప్రక్క అతను పేకాట రాయుడు. పేకాట ఆడటం అంటే అట్టా ఇట్టా కాదు- ఇంట్లోని నగలు, పశువులు చివరకు తన బొమ్మ మెడలోని నగలూ అమ్మి పేకాటకు ధారబోసే వ్యసన పరుడు.

భిన్న మనస్తత్వాలతో కూడుకున్న రాంబాబు పాత్రను దర్శకుడు ముత్యాల సుబ్బయ్య ప్రేక్షకుల గుండెల్లోకి చొచ్చుక పోయేంత వైవిధ్యంతో మలిచాడు. బాగా విడివిగా, నిండుగా వున్న ఈ పాత్రను మోహన్ బాబు ఎంతో జాగ్రత్తతో నటించి ప్రేక్షకులను ఆకట్టు కున్నాడు. ఇంతగా ప్రేక్షకుల ఆదరణను, అభిమానాన్ని దోచుకున్న సోగ్గాడైన రాంబాబును ఏ స్త్రీ ప్రేమించకుండా వుంటుంది? ప్రక్క ఊళ్ళోని మోతుబరి రైతు రాఘవయ్య (సత్య నారాయణ) పెద్ద కూతురు (రమ్యకృష్ణ) చొరవ తీసుకొని రాంబాబును ప్రేమించి పెళ్ళి చేసు కుంటుంది. ఒక బిడ్డను కూడా కంటుంది. ఆ తర్వాత ఆమె చని పోతుంది. బిడ్డ తల్లి కోసం బెంగ పెట్టుకుంటుంది. ఆ గతించిన తల్లి స్థానాన్ని భర్తీ చేసేందుకు రాఘవయ్య రెండో కూతురు (మోనికా బేడి) రాంబాబును పెళ్ళి చేసుకోవా లనుకుంటుంది. అందుకు అంగీక రించని రాఘవయ్య, రాంబాబు దుర్మార్గుడని, మీ అక్కయ్యను (రమ్యకృష్ణను) అతనే హత్య చేశాడని కూతురుకు (మోనికా బేడి) కి చెప్తాడు. తన అక్కను చంపిన రాంబాబును ఆమె నిలదీస్తుంది. అయితే తన అక్కయ్యను చంపింది ఆమెను పెళ్ళి చేసు కోవాలనుకున్న నరసింహం ( మోహన్ రాజ్) అని తెలుసు కుంటుంది. రాంబాబు కూడా ఈ విషయం తెలుసుకొని నరసింహాన్ని ఘోరంగా హత మారుస్తాడు.

బాబ్ కిరణ్ వ్రాసిన కథను దర్శకుడు ఫ్లాష్ బ్యాక్‌తో చాలా హృద్యంగా చూపాడు. రాఘవయ్య రెండో కూతురు తన అక్కయ్య హత్యను గూర్చి

కొరవ 8 పేజీలో

# ప్రభుదేవా పై శిల్పాశెట్టి కామెంట్!

"ఆవులిస్తే నేను పేగులు లెక్క పెట్టేస్తా సుమండి" అంది శిల్పాశెట్టి ప్రభుదేవ గురించి తనకు కొన్ని విషయాలు తెలుసునని చెప్పడానికి ఆమె ఇచ్చిన ఉపోద్ఘాతం అది. "ఓకే - అనే మాటను ఒక రోజుకు ఎన్నిసార్లు ఉపయో గిస్తాడో మాట్లాడే టప్పుడు విమిషాని కొసారి గెడ్డం తడివి చూసు కుంటాడు. ఇక ఏదైనా డాన్స్ మూవ్‌మెంట్ గురించి ఆలోచించే టప్పుడు అదే పనిగా గోళ్ళు కొరుక్కుంటూ వుంటాడు. ఒక్క నిమిషం నిటారుగా నిలువలేడే! నడుముల మీద చేతులుంచుకొని ఒక పక్క, వాలి నిలుచుంటాడు. బహుశా అటువంటి డాన్సర్లకు అటువంటి మేనరిజమ్స్ తప్పవేమో" అంది శిల్ప

**In the Court of the Subordinate Judge,**
Cuddapah
S.C. No. 75/95
State Bank of India, Nandimandalam Branch, Cuddapah Dist. - Plaintiff
Vs
Maddirala Mallikarjuna, S/o. Kondaiah, Nandi mandalam Vil., Pendlimarri Mandalam, Cuddapah Dist. - Defendant

**NOTICE**

పై దావా నందు వాదికి రావలసిన బాకీ రాబట్టు కొనుటకు గాను పై కోర్టులో దావా దాఖలు చేసి యున్నారు. సదరు వాయిదా 4.4.1996 వ తేదికి వున్నది. కావున తమరు పై దావా లేజాన పై కోర్టు నందు ఉదయం 10.30 గంటలకు హాజరై మీ ఆక్షేపణలు తెలుపు కోవలసినది. లేని యెడల పరోక్షములో దావా తీర్మానించ బడును.

-G.S. Moorthy
Advocate for Plaintiff

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. No. 59/89 :
O.S. No. 119/76
సుదర్శన్ చిట్ ఫండ్స్, నెల్లూరు -వాది/DHr
Vs
Md. రఫియుద్దీన్ వగైరా -ప్రతివాదులు/JDrs

ఈ క్రింద పుదహరించిన పెద్యూలు దాఖల స్థిరాస్తులను పై కోర్టులో 4.3.96 తేది వుదయం 10.30 గంటల [illegible] సాయంత్రం 5 గంటల లోపల [illegible] వేలము వేయబడును [illegible] వారు పాల్గొన వచ్చును.

1) [illegible] ప్రతివాది తాలూకు స్థిరాస్తి వివ[illegible] నెల్లూరు జిల్లా నెల్లూరు [illegible] బొకేలో చేరిన [illegible] పాత వార్డు నెం. 7, క్రొత్త వార్డు నం. 11, డోరు నంబరు 371/A సిమెంటు రేకుల అంగడికి హద్దులు:
తూర్పు: వరుస సందు; దక్షిణం: నబీట్ ఇల్లు, ఖాళీ స్థలము; పడమర: కందకం కాల్వ; ఉత్తరం: రోడ్డు. యీ హద్దులలోని 31 2 [illegible]ముల సిమెంటు రేకుల అంగడి మరియు ఒక్క అంకణము ఖాళీ స్థలము.
D.Hr వాల్యు రూ. 4,000/-
అమినా వాల్యు రూ. 50,000/-

2) మూడవ ప్రతివాది తాలూకు స్థిరాస్తి వివరము. నెల్లూరు రిజిస్ట్రేషన్ నెల్లూరు స.రి.లో నెల్లూరు టౌన్ సంతపేట వార్డు నం. 11 డోరు నం. 316 కు హద్దులు: తూర్పు: సందు; దక్షిణం: సందు; పడమర: యీ ఇంటి గోడ; ఉత్తరం: అమ్మిన వారి ఇల్లు యీ హద్దులలోని 21 1/2 అంకణముల ఖాళీ స్థలములో 9 అంకణముల రాతి గోడలతో కట్టబడి ఇల్లు మరియు 12 1/2 అంకణముల ఖాళీ స్థలము.
DHr వాల్యు రూ. 4,000/-
అమీనా వాల్యు రూ. 87,000/-
గమనిక: ఇ.పి. ప్రకారము పై ఆస్తుల పైన ఎటువంటి పరాధీనములు కాని అడమానములు కాని లేవు.
వేలము: 4.3.96
తరువాతి విచారణ: 11.3.96

డి. హనుమంతరావు
డిక్రీహోల్డరు అడ్వకేటు, నెల్లూరు

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

31,356 దరఖాస్తులు రాగా కేవలం 10,746 మందికే కార్డులు మంజూరు చేసారు. అంటే టోకెలోకే ఇంకా 20,610 దరఖాస్తులు పెండింగ్‌లో వున్నాయన్న మాట. వీటిలో సగం దరఖాస్తులను అధికారులు టిక్ చేసినా జిల్లాలోని గృహాల సంఖ్య కార్డుల సంఖ్యకు చేరువౌతుంది. ఈ సంగతి బయట పడితే ప్రభుత్వం నుంచి అక్షింతలు తప్పవని అధికారులు హైరానా పడుతున్నారు. మళ్లీ 22 తేది నుండి 29 తేది వరకు జరిగిన కార్యక్రమంలో వచ్చిన రేషన్ కార్డుల అర్జీలను ఏమి చేయాలో పాలుపోక తలలు పట్టుకొని కూర్చొని వున్నారు. మంత్రులు, ఎమ్మెల్యేలు చివరికి కలెక్టర్ గారు కూడా కొత్త కార్డులు ఇచ్చే కార్యక్రమానికి ఇది అంతం కాదు ఆరంభ మంటున్నారు. ముఖ్య మంత్రి గారేమో నిరంతర నిఘాతో బోగస్ కార్డులు ఏరి వేస్తా నంటున్నారు. ఈ లెక్కకు మించి ఇచ్చిన కొత్త కార్డులు, పాత కార్డులను పార్లమెంటు ఎన్నికల తర్వాత పెరుక్కోరు కదా?

### కరవు మండలాల్లో ప్రతి పక్షీయుల పై వివక్షత!

జిల్లాలోని 46 మండలాల్లో ముప్పయి మూడింటిని కరవు మండలాలుగా ప్రకటించింది రాష్ట్ర ప్రభుత్వం. అయితే కరవు విలయ తాండవం చేస్తున్న కావలి డివిజన్‌ను విస్మరించి సుభిక్షంగా వున్న మిగతా డివిజన్లలోని మండలాలను మాత్రం ఎంపిక చేయడంతో దీని పై పెద్ద ఎత్తున నిరసన వ్యక్త మౌతూంది. కరవు మండలాల ఎంపికలో పొరపాటు జరిగిందని జిల్లా మంత్రి రమేష్ రెడ్డి, కలెక్టర్ సాంబశివ రావులు కూడా ఒప్పుకొన్నారు. మళ్లీ ఈ విషయమై ప్రభుత్వానికి నివేదిక పంపుతానని కలెక్టర్ హామీ ఇచ్చారు. వర్షాభావ పరిస్థితుల ఆధారంగా కరవు మండలాలను ఎంపిక చేస్తుంటారు. కాని ఈ యేడాది అత్యల్ప వర్ష పాతం నమోదైన దగదర్తి, సీతారామ పురం, కొండా పురం, కలిగిరి మండలాలు ఈ జాబితా నుంచి మాయమై పోయాయి. కాంగ్రెస్ ఎమ్మెల్యే వుండే కావలి, కమ్యూనిస్టు ఎమ్మెల్యే వుండే అల్లూరు నియోజక వర్గాల పట్ల సవతి తల్లి ప్రేమ చూపారనే విమర్శకు ఆస్కారం కల్గింది దీనివల్ల. ఈ రెండు నియోజక వర్గాలలోని కావలి, కలిగిరి, కొండాపురం, జలదంకి మండలాలు, అల్లూరు, దగదర్తి, బోగోలు మండలాలు ఈ జాబితాలో చోటు చేసుకోలేదు. వేసిన పంటలు ఎండిపోయి పశువులు తోలి పైరు మేపు కోవలసిన దుస్థితిలో వున్న దొరవారి సత్రం, సీతారామ పురం వంటి మండలాలు కాగడా వేసి వెతికినా ఈ జాబితాలో కనపడలేదు. విచిత్ర మేమిటంటే ఎన్టీఆర్ వర్గం శాసన సభ్యుడు నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్న జిల్లా ప్రాంతమైన కోవూరు నియోజక వర్గం ఈ కరవు జాబితాలో చోటు చేసుకొన్నది. అదే విధంగా పుష్కలంగా కాలువ నీరు పంటలకు ఇబ్బంది లేకుండా అదనంగా ఫిల్టర్ పాయింట్ సౌకర్యం కూడా వుండే ఇందుకూరు పేట, నెల్లూరు రూరల్, తోటపల్లి గూడూరు మండలాలు; సోమశిల నీళ్లు వుండే ఆత్మకూరు మండలాలను కరవు జాబితాలో చేర్చి తన గుర్తి తనాన్ని చాటి చెప్పింది ప్రభుత్వం. రిలీఫ్ కమీషనర్ బ్రహ్మ ఆ మధ్య కావలి నియోజక వర్గంలో స్వయంగా పర్యటించి పరిస్థితులు ప్రత్యక్షంగా చూసారు. అప్పటికే కావలిలో బావులు సైతం ఎండిపోయి నీటికై ప్రజలు అల్లాడి పోతుండినారు. ఆయన పరిశీలన కరవు మండలాల నిర్ణయంలో ఎందుకు పరిగణనకు రాలేదో అనూహ్యం. వివక్షతకు గురైన ఎమ్మెల్యేలలో కలిశి యానాది రెడ్డి ఇప్పటికే నోరు విప్పారు. జక్కా వెంకయ్య గారు ఎందువల్లనో మౌనంగా వున్నారు.

కరవు నివారణకు 60 కోట్ల తక్షణ సహాయం అందించమని కలెక్టరు కోరితే కేవలం 55 లక్షల రూపాయలు మంజూరు చేసి చేతులు దులుపు కొన్నది రాష్ట్ర ప్రభుత్వం. ఈ విషయంలో జిల్లా ఎమ్మెల్యే లంతా ఏకమై రాష్ట్ర ప్రభుత్వం పై వత్తిడి తెచ్చి తగినన్ని నిధులు మంజూరు చేయించడంతో పాటు కరవు పరిస్థితులు నెలకొని వున్న మండలాలను జాబితాలో చేర్చాలి. కరవు లేని వాటిని తొలగించాలి లేకుంటే ఈ జాబితా మె నవ్వుల పాలై పోతుంది.

### తిక్కన విజ్ఞాన కేంద్రం సాహిత్యోపన్యాసాలు!

నెల్లూరులోని తిక్కన విజ్ఞాన కేంద్రం ఆధ్వర్యంలో మార్చి 4, 5, 6, 7, 8 తేదిల్లో టౌన్ హాల్‌లో సాహిత్యోపన్యాసాలు ఏర్పాటవు తున్నాయి. 4 తేది కృష్ణ శాస్త్రి సమాజ భావన పై ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహన రావు; 5 తేది శృంగార శాకుంతలం పై డాక్టర్ శివలింక ప్రకాశ రావు; 6 తేది ధూర్జటి మహాకవి కవితా వైభవం పై డాక్టర్ జంధ్యాల మహతీ శంకర్; 7 తేది ప్రభావతీ ప్రద్యుమ్నం పై డాక్టర్ అనుమాండ్ల భూమయ్య; 8 తేది కేయూర బాహు చరితం గూర్చి ఆచార్య ఎస్. గంగప్ప మాట్లాడు తారని తిక్కన విజ్ఞాన కేంద్ర స్థాపనాధ్యక్షులు మరుపూరు కోదండ రామిరెడ్డి తెలియ జేస్తున్నారు.

### రంగనాథస్వామి బ్రహ్మోత్సవాలు!

శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి వారి బ్రహ్మోత్సవాలు ఫిబ్రవరి 29 తేది నుండి మార్చి 10 తేది వరకు జరుగుతాయి. 29 తేది అంకురార్పణ; 1 తేది ధ్వజారోహణం; 2 తేది ఉదయం హంస వాహనం; 3 తేది సింహ వాహనం, చంద్రప్రభ; 4 తేది హనుమంత సేవ; 5 తేది బంగారు గరుడ సేవ; 6 తేది కళ్యాణోత్సవం; 7 తేది రథోత్సవం నిర్వహిస్తారు. 8 తేది అశ్వ వాహనం, 9 తేది ప్రణయ కలహోత్సవం.

ఈ యేడాది ప్రత్యేకత స్వామి వారికి తెప్పోత్సవం నిర్వహించడమని కార్య నిర్వహణాధికారి శ్రీ గుమ్మనేని ప్రభాకర్ తెలియ జేస్తున్నారు.

### కౌన్సిలర్లను అగౌరవ పరచడం లేదు!

మూడవ విడతగా జరిగిన ప్రజల వద్దకు పాలన కార్యక్రమానికి నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్, కౌన్సిలర్లను ఆహ్వానించ లేదనే విమర్శలు రేగాయి. ఈ విషయంలో నిబంధనలు, నియమాలు గుర్తు చేస్తూ మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి కలెక్టరుకు ఒక లేఖ వ్రాసారు. కౌన్సిలర్లకు కనీస పాటి పిలుపు లేదని కాంగ్రెస్ కౌన్సిలర్లు కె. రాఘవ రెడ్డి, చాట్ల నరసింహ రావు పత్రికల కెక్కారు. కార్డుల పంపిణీ కేవలం పచ్చ చొక్కాల నేతృత్వంలో జరుగుతున్నదని వీరి ఆవేదన. కాని 24 తేది మునిసిపల్ కమీషనర్ ఆంజనేయులు, ఇంజనీర్ రామ సుబ్బారెడ్డి ప్రజల వద్దకు పాలనకు సంబంధించిన పూర్తి వివరాలు కౌన్సిలర్లకు పంపామని ఈ విమర్శకు సమాధానం చెప్పారు. కార్యక్రమం కాగితం ఒకటి పంపి తమ పని అయ్యిందని అధికారులు భావించ బట్టే ఈ విషయంలో ఇంత రగడ జరిగింది.

### రామకృష్ణ సేవా సమితి సహాయం!

ఫిబ్రవరి 20 తేది టౌన్ హాల్‌లో రామకృష్ణ పరమ హంస జయంతి సభ జరిగింది. ఉపన్యాస కులుగా విచ్చేసిన గూడూరు దివ్యజ్ఞాన సమాజం అధ్యక్షులు శ్రీ సి. వెంకట శేషయ్యను సభా పోషకులు రోటేరియన్ శ్రీ ఎం. ధర్మారెడ్డి సన్మానించారు. సన్మానంలో అందించిన పర్సు మొత్తం 500 రూపాయలను వెంకట శేషయ్య గారు తిరిగి నెల్లూరు రామకృష్ణ సేవా సమితికి విరాళంగా అందజేసారు. సమితికి సహాయం చేసినందుకు కార్యదర్శి ఎన్.వి. నరసింహ రావు కృతజ్ఞతలు తెలియ జేస్తున్నారు.

### విద్యార్థులకు పోటీ పరీక్ష

టౌన్‌లోని సుధా కామర్స్ జూనియర్ కాలేజి ఇంటర్ సి.ఇ.సి., ఎం.ఇ.సి. విద్యార్థులకు పోటీ పరీక్ష నిర్వహిస్తున్నది. మార్చి 10 తేది జయభారత్ హాస్పిటల్ సందులో వున్న కాలేజిలో పరీక్ష జరుగుతుంది. పైన పేర్కొన్న రెండు గ్రూపు సబ్జక్టుల్లో వివిధ అంశాలే పోటీ ప్రశ్నా పత్రంలో వుంటాయి. విజేతలకు ప్రథమ బహుమతిగా 1000, ద్వితీయ, తృతీయ బహుమతులుగా 500, 250 అందిస్తారని కాలేజి ప్రిన్సిపల్ తెలియ జేస్తున్నారు. ఇతర వివరాలను కళాశాల పని చేసే సమయంలో అడిగి తెలుసు కోవచ్చు.

## పంచ హైకూలు

1
వాలిన మేఘం
సముద్రపు తీరాన
మాయమై పోతూ

2
కులం, మతం
భేదం సమసిపోయి
జన్మ యాత్రల్లో

3
వికసిస్తాయి
చూసి ఆనందిస్తే -
మరి; తర్వాత...

4
చుట్టూ ఏకాంతం,
పంజరపు జీవితం
స్పందిస్తూ రోజా

5
కిటికీలోంచి,
శకలాల వీక్షణం
సుప్త నిద్రిస్తూ,

- పూనూరు శ్రీధర రెడ్డి

## సినిమా

9 పేజీ కొరవ

ఒక వివాహానికి రెడీ. అని ఆయనతో చెప్పడమే తరువాయి - చకచకా ఏర్పాట్లు జరిగి పోయాయి. నాకు ఇష్టులయిన వారినే ఆహ్వానించాను. తిరుమలలో వివాహం శుభంగా జరిగింది. మా శ్రీవారు ఎంతో సహృదయులు. "పెళ్ళయి పోయింది కదా? ఇక నీ తైతక్క ఆటలు కట్టిపెట్టు. ముందుగా నాకో బాబును అందించు" అన్నారు. ఇక వేరే పని ఏముంది? అన్నాను - అంది దివ్యా కాంతి నవ్వుతూ.

### ప్రేమప్రయాణం

ప్రతి మనిషి జీవితంలో రైలు ప్రయాణం లాగా లవ్ జర్నీ జరుపు తుంటారు. అదే ఈ చిత్ర కథ అన్నారు ప్రేమ ప్రయాణం చిత్రానికి దర్శకత్వం నెరపుతున్న ముత్యాల సుబ్బయ్య. వినోద్ కుమార్, శ్రీకాంత్, సౌందర్య, సత్య నారాయణ, నూతన్ ప్రసాద్, వేలు, బ్రహ్మానందం, ఎ.వి.ఎస్. నర్రా, రాళి పాత్రధారులు.

### బొబ్బిలి బుల్లోడు

ఎంతో అన్యోన్యంగా ఉండే అన్న, చెల్లెలు - విరోధులుగా మారడం ఈ కథలోని కొత్త అంశం అన్నారు కె. రంగారావు. ఆయన దర్శకత్వం వహించే పై చిత్రంలో వినోద్ కుమార్, రాజ్ కుమార్, ఇంద్రజ, శ్రీశాంతి, లతాశ్రీ, జయలలిత, కృష్ణశ్రీ, బాలయ్య, భరణి, బాబూ మోహన్, బ్రహ్మానందం, గుండు హనుమంత రావు, శ్రీహరి, దేవా, మల్లికార్జున రావు పాత్రధారులు. ఎస్.ఎం. ఇబ్రహీం అలీ ఖాన్, ఎస్.ఎం. రజా అలీఖాన్ నిర్మాతలు.

## నెల్లూరు Ist అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో

Scs. 115 of 1994
Syndicate Bank, Main Branch, Nellore represented by its Manager -వాది -
Vs
గునపాటి గోపాలురెడ్డి
(S/o. రామచంద్రారెడ్డి)
సాకిన్: చింతోపు గ్రామం తోటపల్లి గూడూరు మండలం, నెల్లూరు జిల్లా -ప్రతివాది

యీ నంబరున వాది [illegible] మొత్తము దరిమిలా వడ్డీ ఖర్చుల తోటి రాబట్టు కొనుటకు గాను ప్రతివాది మీద దావా దాఖలు చేసు [illegible] ప్రతివాదికి దావా నోటీ[illegible] నిమిత్తం 4.3.96 తేదిన వాయిదా వేయబడి యున్నది. కావున [illegible] ప్రతివాది పగలు 10 గంటలకు కోర్టులో హాజరై యేదైనా ఆక్షేపణలున్న యెడల తెలుపుకొన వలయును. లేని యెడల పరోక్షమున తీర్మానించ బడును.

కె. బుజ్జిరెడ్డి, [illegible]
వాది అడ్వకేటు

## నవ్వుల పాలైన కరువు మండలాల జాబితా

# కోవూరులో కరువు, కావలిలో సుభిక్షమా?

జిల్లాలో వర్షాలు లేక పంట లెండిపోయి. సిద్ధి కటకట లాడుతున్న మండలాల్లో కావలి ప్రథమ స్థానంలో వుండగా కేవలం రాజకీయ దురుద్దేశంతో కరువు ప్రాంతంగా ప్రకటించలేదని ఎమ్మెల్యే కలికి యానాది రెడ్డి విమర్శించారు. 27 తేది కావలిలోని తన స్వగృహంలో విలేకరులతో మాట్లాడుతూ రాష్ట్ర రిలీఫ్ కమీషనర్ హరిశంకర బ్రహ్మ నియోజక వర్గంలో పర్యటించి కావలిని కరవు ప్రాంతంగా ప్రకటించాలని ప్రభుత్వానికి నివేదిక పంపారని సోమశిల ద్వారా నీటిని వెంటనే విడుదల చేయాలని, విద్యుత్ కోతను నిలుపుదల చేయాలని కూడా ఆయన ప్రభుత్వాన్ని సూచించారని; కాని అధికార పార్టీ వారు విపక్షానికి చెందిన వాడినని తన పై కక్ష కట్టి ప్రజలను ఇబ్బంది పెడుతున్నట్లు విమర్శించారు యానాది రెడ్డి గారు. అధికార పార్టీ ఎమ్మెల్యేలు ప్రాతినిధ్యం వహిస్తున్న నియోజక వర్గాలలోని జిల్లా మండలాలను కూడా కరవు జాబితాలో చేర్చడం అన్యాయ మన్నారాయన. ఇప్పటికైనా ముఖ్య మంత్రి జిల్లాలో కరవు ప్రాంతాల ఎంపికలో జరిగిన అన్యాయాలను పరిశీలించి సరిదిద్దాలని కలికి కోరారు.

### నిధుల లేమితో విద్యుత్ పనులు ఆసాములకు...

ప్రభుత్వ ఆర్థిక ఇబ్బందుల వల్ల విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణానికి ప్రైవేట్ సంస్థలకు అప్పజెప్ప వలసి వస్తున్నదని నెల్లూరు రీజియన్ ఎలక్ట్రికల్ చీఫ్ ఇంజనీరు శ్రీ ఎస్. గురుమూర్తి రెడ్డి చెప్పారు. ముత్తుకూరులో 28 తేది కృష్ణ పట్నం థర్మల్ విద్యుత్ ప్రాజెక్టు పై ఏర్పాటు చేసిన చర్చా వేదికలో పాల్గొని మాట్లాడారాయన. విద్యుత్ శాఖలో నిపుణులైన శాస్త్రవేత్తలు, తగిన శాస్త్ర పరిజ్ఞానం వున్నప్పటికీ నిర్మాణానికి అవసరమైన వనరులు లేక పోవడం వల్ల వాటిని ప్రైవేట్ పరం చేయక తప్పదం టిదన్నారు. 1997 నాటికి రాష్ట్రంలో 9 వేల మెగావాట్ల విద్యుత్ అవసరం వుండగా ప్రస్తుతం 6 వేల మెగా వాట్లు మాత్రమే ఉత్పత్తి అవుతున్నట్లు చెప్పారు. కృష్ణ పట్నం థర్మల్‌ను పూర్తి చేసి నట్లైతే రాష్ట్ర అవసరాలకు పోను. ఇతర ప్రాంతాలకు విద్యుత్ అందించ వచ్చన్నారు. విద్యుత్ విషయమై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగిన శ్రద్ధ తీసుకోకుంటే 2 వేల సంవత్సరాల నాటికి దేశం గాంధార కారం అనుభవించక తప్పదేమోనని ఆందోళన వ్యక్తం చేశారు. జన విజ్ఞాన వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షుడు డాక్టర్ విజయ కుమార్ కూడా ఈ చర్చా వేదికలో పాల్గొన్నారు.

### మోమిడి, వరగలిలపై మంత్రి ప్రేమెందుకు!

శాసన సభ్యుడిగా తన కోటాలో మంజూరైన పక్కా గృహాలను గూడూరు ఎమ్మెల్యే, విద్యాశాఖ మంత్రి శ్రీ బల్లి దుర్గాప్రసాద్ ప్రత్యేకించి కొందరికే కేటాయించడం ఆ పార్టీ కార్యకర్తలకు మింగుడు పడడం లేదు. గత ఐదు సంవత్సరాల క్రితమే పక్కా గృహాల కోసం డిపాజిట్లు కట్టిన తమకు కాకుండా ఇటీవల తనతో కొత్త సుబ్బరికం చేస్తున్న పెద్దలిచ్చే దాఖలాలను బట్టిబ్బే మంత్రి మంజూరు చేయడం పట్ల నియోజక వర్గంలోని సీనియర్ కార్యకర్తలు నిరసన వ్యక్యం చేస్తున్నారు. ఇటీవల దుర్గా ప్రసాద్‌తో సఖ్యతగా వుంటున్న మోమిడి, వరగలి గ్రామస్తులకే తన కోటాలో మంజూరైన పక్కా గృహాలలో అధిక శాతం మంత్రి కేటాయించారు. చెట్టుపల్లి గ్రామానికి చెందిన అరుంధతీయులు 70 మంది తాము 11 సంవత్సరాల క్రితం డిడిలు కట్టి వున్నామని మంత్రికి విన్న వించుకొన్నా ఫలితం లేకుండా పోయిందట. ముందు నుంచి డిడిలు కట్టి వున్న వారికి ప్రాముఖ్యత ఇవ్వాలని అధికారులు చెప్పినా మంత్రి ససేమిరా కాదంటున్నారట. ఎంపిటిసి, పంచాయితీ ఎన్నికల సమయంలో ఇళ్ల కోసం డిడిలు కట్టుకోండని మంత్రి నియోజక వర్గంలో పలువురికి హామీ ఇచ్చి ఇప్పుడామాట మర్చిపోయారు. అదే విధంగా ప్రజల వద్దకు పాలన కార్యక్రమం లోకూడా కార్డులు, నివేశన పట్టాలు మంజూరు చేయడంలో మంత్రి కార్యకర్తలను విస్మరించారని పార్టీ కార్యకర్తలు బాహాటంగా విమర్శిస్తున్నారు.

### వెంకటగిరి పోలీసు బెటాలియన్‌లో మోసం!

గూడూరుకు చెందిన వేమిరెడ్డి కృష్ణారెడ్డి అనే యువకుడు రెండేళ్ల క్రితం వెంకటగిరిలోని పోలీస్ బెటాలియన్ కానిస్టేబిల్ అర్హత పరీక్షలో నెగ్గాడట. త్రిస్టార్ టెస్ట్, ఇంటర్వ్యూలు 94 ఆగస్టులోనే పూర్తి చేసాడట. అతనికి సంబంధించిన విద్యా పరమైన సర్టిఫికేట్లు బెటాలి యన్‌లోనే వుంచు కొన్నారట అధికారులు. నియామకానికి ముందు శాఖా పరంగా జరిపే ఎస్‌బిఐ విచారణ

కొరవ 8 పేజీలో

> రాష్ట్ర ప్రభుత్వం తన గుడ్డి తనం బయట పెట్టింది; జిల్లా ఎమ్మెల్యేలు తక్షణం ఈ పొరపాటు సరిదిద్దాలి!

# జన్నవాడ జీపులు ఎప్పుడో చావు బండ్లుగా మారుతాయి!

పురాణాల్లో దేవతలు పుష్పక విమానాలు వాడే వారని మనం విన్నాం. ఆ పుష్పక విమానాలే నేడు తమ రూపు మార్చుకొని జీపుల రూపంలో బుచ్చి రెడ్డి పాళెం జొన్నవాడ గ్రామాల మధ్య విహరిస్తూ ప్రయాణీకులకు ప్రత్యక్ష నరకాన్ని చవి చూపిస్తున్నాయి.

కామాక్షమ్మను దర్శించుకొని తమ మొక్కులను తీర్చుకోవడానికి నిత్యం పెద్ద సంఖ్యలో భక్తులు వస్తుంటారు. శుక్రవారం ఈ సంఖ్య మరింత ఎక్కువగా ఉంటుంది. కాని ఈ విషయం రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ వారికి మాత్రం తెలియక పోవడం ఆశ్చర్య కరం. ప్రయాణీకుల అవసరాలు పట్టించు కోకుండా నామ మాత్రంగా జొన్నవాడకు వీళ్లు బస్సు నడుపు తున్నారు. ఈ అవకాశాన్ని జీపుల వారు చక్కగా వుపయోగించు కొంటున్నారు. ఒక్కొక్క జీపులో 20 మంది కూర్చొనే వరకు దాన్ని కదల్చరు. పుష్పక విమానంలో ఎంత మంది ఎక్కినా ఒకరికి ఖాళీ స్థలం ఉండే ఆ యంత్ర మహిమేదో ఈ జీపులకూ వున్నట్లుంది. దారిలో ఎవరైనా ఆపితే వారిని కూడా జీపుల్లో కష్టపడి ఎక్కించు కొంటారు. జీపులు ఏ కండిషన్‌లో ఉన్నప్పటికీ నడిస్తే చాలు నని వీటి యజమానుల భావన. ఇవి ఎక్కిన తరువాత మనం సక్రమంగా గమ్య స్థానానికి చేరుతామన్న నమ్మకం లేదు. మధ్య మధ్యలో జీపుల ఛేజింగులూ జరుగు తుంటాయి. అన్నింటినీ భరించి ఆడ మగ తేడా మరచి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తమ ప్రాణాలు ఆ కామాక్షమ్మ కాపాడు తుందన్న భరోసాతో వీటిలో ప్రయాణిం చడాన్ని భక్తులు నేర్చుకొన్నారు. ఈ జీపుల విషయంలో చర్య తీసుకోవాల్సిన

### జిల్లావార్తలు

బుచ్చి పోలీసులకు, ఆర్‌టిఓ సిబ్బందికి ఈ పుష్పక విమానాల దేవతలు ఏమి వరాలిచ్చారో తెలియదు కాని వారెవరూ ఈ విమానాల జోలికి పోరు. దానితో జీపు యజమానుల వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతూంది.

### వాటర్ ట్యాంక్ ఏర్పాటు

బుచ్చిరెడ్డి పాళెంలోని హరిజన వాడలో ఎనిమిది లక్షల రూపాయల

కొరవ 8 పేజీలో

# ఎడారైపోయిన బుచ్చి పార్కు!

బుచ్చిరెడ్డి పాళెంలోని బెజవాడ గోపాల రెడ్డి పంచాయితీ పార్కుకు సరైన సంరక్షణ లేక ఎడారిలా మారి వుంది. ఒకప్పుడు పార్కులో పిల్లలు ఆటలాడుకునే పరికరాలు ఉండేవి. అవి ఒక్కొక్కటిగా మాయమై పోయాయి. పార్కులో ఉన్న విష్ణుమూర్తి, గుర్రం మీద స్వారీ చేసే మహిళ, చెట్లకు నీరుపోస్తున్న స్త్రీ మొదలైన విగ్రహాలు మాయమై పోగా మిగిలినవి నేడో రేపో అన్న దుస్థితిలో ఉన్నాయి. పార్కు అంటే అందమైన పూల చెట్లు, కమ్మని సువాసనలతో కూడిన గాలి గుర్తుకు రావడం సహజం. కాని ఈ పార్కులో మొదళ్ళతో సహా పీకేసిన ఎండు పొదలు, పనికి రాని పిచ్చి మొక్కలతో ఎడారిని గుర్తుకు తెస్తుంది. సువాసనలకు బదులు ఒక ప్రక్క చెత్త కంపు, మరో వైపు మురుగు కాలువ కంపు ముక్కులు పగుల గొడ్తుంటాయి. పార్కులో కూర్చోవడానికి అవసరమైన సిమెంటు బల్లలు శిథిలమై పోవడంతో వచ్చిన వారు నేల పైన చతికిల బడాల్సి వస్తున్నది. పార్కులోకి రావాలంటే పిల్లలు భయపడు తుంటారు. పాములు పార్కులో స్వేచ్ఛగా విహరించడమే దీనికి కారణం. సరి అయిన వసతులు కల్పించి పార్కును మెరుగు పరచాలన్న ఆలోచన, ఇంత వరకు పంచాయితీ వారికి రాక పోవడం విచారకరం.

### అనంతసాగరంలో ప్రజల వద్దకు పాలన!

మూడవ విడత ప్రజల వద్దకు పాలన కార్యక్రమం అనంత సాగరం మండలంలో విజయవంతంగా జరిగింది. పాలన కార్యక్రమంలో పడమట కంభంపాడు గ్రామంలో ఎస్.సి.ల్లో 55 మందికి ఇళ్ల స్థలం పట్టాలు, 14 మందికి రేషన్ కార్డులు, 15 మందికి వృద్ధ్యాప్య ఫించన్లు పంచి పెట్టారు. సోమశిల గ్రామంలో 140 మందికి రేషన్ కార్డులు, 260 మంది గ్రామస్తులకు ఇళ్ల స్థలం పట్టాలు, ఇద్దరికి వృద్ధాప్య ఫించన్లు ఇచ్చారు. కమ్మవారి పల్లెలో 5 మందికి రేషన్ కార్డులు, 5 మందికి ఫించన్లు, మరో 15 మందికి ఇళ్ల పట్టాలు అందించారు. ఈ కార్యక్రమాల్లో ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు, ఎమ్మార్వో సూర్య నారాయణ, ఎమ్డీఓ రాజశేఖర్, నోడల్ అధికారి ఆర్. చెన్న కేశవులు పాల్గొన్నారు.

# అల్లూరు కానిస్టేబిల్ ఆదర్శం!

పోలీసు కానిస్టేబిల్ అంటే కనికరం లేని కసాయితనం సహజంగా గుర్తొస్తుం టుంది. కాని తన హృదయంలోని అరుదైన మానవత్వాన్ని ఎ.ఆర్.పి.సి. ఐ.టి. కుమార్ అనే కానిస్టేబిల్ చూపించారు. అల్లూరులోని శాంతి నికేతన్ హాస్పిటల్‌కు ఇస్కపల్లి గ్రామానికి చెందిన నిండు చూలాలైన ఒక జాలర్ల యువతి ఫిబ్రవరి 14 తేది వచ్చి చేరింది. కాన్పుకు, ఆపరేషన్ తోడు కావడంతో ఆ యువతికి బి పాజిటివ్ రక్తం అవసర మయ్యింది. రక్తం అల్లూరులో దొరకక యువతి బంధువులు క్రిందా మీద పడుతుండినారు. అర్ధరాత్రి సమయంలో పాత బస్టాండులో ఈ విషయం తెలుసుకొన్న కానిస్టేబిల్ కుమార్ తానే స్వయంగా ఆసుపత్రికి వెళ్లి తన రక్తమిచ్చి యువతి ప్రాణం కాపాడాడు. కానిస్టేబిల్ సేవా నిరతిని ఆసుపత్రి డాక్టర్ షేక్ కాలిషా, యువతి తల్లిదండ్రులు కొనియాడారు. పోలీసుల్లో ఇంతటి మానవత్వం చాలా తక్కువ మందికి వుంటుందని; ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

### చేపల కాలేజిలో చేపల ఉత్సవం!

ముత్తుకూరులోని మత్స్య కళాశాలలో తొలిసారిగా రాష్ట్ర స్థాయిలో మత్స్య మేళా నిర్వహి స్తున్నట్లు కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ ఎం. బాబురావు చెప్పారు. కిసాన్ మేళా మాదిరిగానే ఈ మత్స్య మేళాను మార్చి 4,5 తేదిల్లో ఇక్కడ నిర్వహిస్తున్నారు. ఈ ఉత్సవంలో వివిధ రకాల చేపలు, రొయ్యల జాతులను ప్రదర్శిస్తారట.

### జిల్లా గ్రామ పంచాయితీ వుద్యోగుల సంఘం

ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయితీ ఎంప్లాయిస్ అసోసి యేషన్ నెల్లూరు జిల్లా సర్వసభ్య సమావేశం 18 తేది టౌన్‌హాల్‌లో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా సి.హెచ్. వర ప్రసాద రావు, సహాధ్యక్షునిగా గ్రంధి శ్రీనివాసులు, ఉపాధ్యక్షులుగా పి. నాగరాజు, ఎన్. శ్యాం ప్రసాద్, ఎం. సుబ్రహ్మణ్యం, సి.హెచ్. పట్టాభి రామిరెడ్డి, కార్యదర్శిగా కె. బ్రహ్మయ్య, సహ కార్యదర్శులుగా పి. శ్రీనివాసులు, బి.సి. పుల్లయ్య, స్వామిదాసు, బి. మునికృష్ణయ్య, కోశాధికారిగా దాసరి కామేశ్వర రావులను ఎన్నుకొన్నారు.

# ఉత్తరక్రియలు



జననం:
27.11.1921

మరణం:
20.2.1996

మా తండ్రి

# శ్రీ కొడవలూరు రాధాకృష్ణారెడ్డి గారు

**20.2.96** తేది మంగళవారం ఉదయం **5.20** గంటలకు స్వర్గస్తులైనారు.

| | | | |
|---|---|---|---|
| *1.3.96 తేది* | *శుక్రవారం* | *రాత్రి* | *శిలాప్రతిష్ట* |
| *2.3.96 తేది* | *శనివారం* | *ఉదయం* | *పెద్దకర్మ, బ్రాహ్మణ బియ్యాలు* |

నెల్లూరు జిల్లా కోట గ్రామంలోని మా స్వగృహము నందు జరుగును.

బంధుమిత్రులు తెలియగోరుతాము.

అల్లుడు - కుమార్తె
సిద్ధారెడ్డి జనార్దనరెడ్డి - ఇంద్రసేనమ్మ

కుమారులు - కోడళ్లు
కొడవలూరు సుబ్బారెడ్డి - శైలజ
కొడవలూరు ధనుంజయ రెడ్డి - రజని
కొడవలూరు నరోత్తమరెడ్డి - భారతి

కోడలు: స్వర్గీయ కొడవలూరు పద్మనాభ రెడ్డి గారి భార్య కొడవలూరు విజయమ్మ

మనుమలు
సిద్ధారెడ్డి సుధీర్ రెడ్డి
కొడవలూరు శరణ్ రెడ్డి
కొడవలూరు సందేష్ రెడ్డి
కొడవలూరు దీపక్‌రామ్ రెడ్డి
కొడవలూరు హిమవర్ష రెడ్డి

మనుమరాళ్లు
సుమన
కల్పన
సునీల
శిల్ప
దివ్య
షీన

అన్నదమ్ములు
కొడవలూరు జానకిరామిరెడ్డి
కొడవలూరు చంద్రశేఖర్ రెడ్డి

కుటుంబ డాక్టరు
ధనిశెట్టి శివాజీరావ్

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore